# హేతువాద దృక్పథం - విధానపర కర్తవ్యం

## (Rationalist Attitude - Methodological Duty)



**జన వికాస వేదిక**

(విజ్ఞానశాస్త్ర ప్రచారోద్యమ స్వతంత్ర సామాజిక చైతన్య సంస్థ)

ఆంధ్రప్రదేశ్ - తెలంగాణా

# హేతువాద దృక్పథం - విధానపర కర్తవ్యం

(Rationalist Attitude - Methodological Duty)

గౌరవ్

**జన వికాస వేదిక**

(విజ్ఞానశాస్త్ర ప్రచారోద్యమ స్వతంత్ర సామాజిక చైతన్య సంస్థ)

ఆంధ్రప్రదేశ్ - తెలంగాణా

హేతువాద దృక్పథం - విధానపర కర్తవ్యం
(Rationalist Attitude - Methodological Duty)

జన వికాస వేదిక
(విజ్ఞానశాస్త్ర ప్రచారోద్యమ స్వతంత్ర సామాజిక చైతన్య సంస్థ)



ఏప్రియల్ 2015

ప్రతిపాదిత చందా : 20/-

ప్రతులకు : 9032094492

వివరాలకు : gouravmeka@gmail.com

---

"For it is peculiarity of our age that the rebels against the existing order, at any rate the most numerous and characterstic of them, are also rebelling againt the idea of individual integrity. 'Daring to stand alone' is ideologically criminal as well as practically dangerous. The independence of the writer and the artist is eaten away by vague economic forces, and at the same time it is undermined by those who should be its defenders... the enemies of intellectual liberty always try to present their case as a plea for discipline verses individualism... the writer who refuses to sell his opinions is always branded as a mere egoist."

**– George Orwell**

The prevention of literature

# మనవి

**మన** భావాలకి సరిపోయేదంతా మంచిదనే భావన సరిపడనిదంతా చెడ్డదనే అభిప్రాయానికి దారితీస్తుంది. అలాంటప్పుడు మంచి చెడులనే పదాలకు ఎవరికి నచ్చినర్థం వాళ్ళు తగిలించుకుని తోచినట్టు సాగదీసుకుంటుంటారు. కొద్దికాలం నుంచి అప్పుడప్పుడు వివిధ సందర్భాల్లో రాసిన కరపత్రాలు, వ్యాసాల సంకలనమిది. ఆనాటి నా ఆలోచనావిధానానికి వత్తాసు పలకని వ్యక్తీకరణల్ని కూడా ప్రత్యేకంగా వ్యతిరేకించే ప్రయత్నమేదీ చేయకుండా వున్నవున్నట్లుగానే వీట్ని ప్రచురిస్తున్నాను. అన్నిటినీ కలగాపులగం చేయకుండా కరపత్రాలు, వ్యాసాలు వేటికవిగా చేసాను. నేనందరభిప్రాయాలతో ఏకీభవించేందుకు సిద్ధపడని వాడ్నవటంచేత నా అభిప్రాయాలన్నింటితో అందరూ ఏకీభవించాలనే పేచీ నాకు లేదు. జనభావ చైతన్యోద్యమాలకి నా వంతు కించిత్తు బాసటగా రచనా వ్యాసాంగాన్ని అందించాలనే తపనతో ఆతృతకొద్దీ చేతనైన ప్రయత్నాలు చేస్తున్నాను. అలాగే, వీటిని ప్రచురించిన పత్రికలకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ప్రజాఉద్యమాలకు అక్షరాలతో, ఆచరణతో ఆసరాగా నిలవడం మినహా నిబద్ధతగల కార్యకర్తకంతకుమించిన కర్తవ్యం వుంటుందనుకోను.

# సూచిక

## కరపత్రాలు



## వ్యాసాలు.

# మూఢాచారాల నిరోధక చట్టాన్ని తక్షణం అమలుచేయాలి

**మన** రాష్ట్రంలో ఈరోజు ఏ మూల చూసినా మూఢనమ్మకాలు తాండవిస్తున్నాయి. ప్రతి ఊరిలోను ఎందరో బాబాలు, అమ్మలు దుకాణాలు తెరిచి సామాన్యుల్ని లూటీ చేస్తున్నారు. స్వచ్ఛంద నైతిక విలువల్లేని సమాజం అంధవిశ్వాసాల్లోనే కాలం వెళ్ళబుచ్చుతుంటుంది. అది ఆలోచనా శూన్యతకు దారితీయకుండా అప్పుడప్పుడు మేల్కొలుపు కార్యక్రమాలవశరం. భావోద్యమాల్లో ఇదో ముఖ్య భూమిక. డా॥ నరేంద్ర దభోల్కర్ పైశాచిక హత్యతో నిద్రలోంచి లేచిన మహారాష్ట్ర ప్రభుత్వం 'మూఢాచారాల నిరోధక చట్టాన్ని' హడావుడిగా ప్రకటించింది. అయితే, ఆశ్చర్యకరంగా అనేక కేసులు ఆ చట్టాన్ని ఆదారం చేసుకుని నమోదవుతున్నాయి. కర్ణాటకలో సైతం అది చట్టంగా త్వరలోనే రానుందని తెలుస్తోంది.

ఇలాంటప్పుడు మన రాష్ట్రంలో సైతం ఆ చట్టాన్ని అమలుపరచాలని డిమాండ్ చేయడం, అందుకు కలిసొచ్చే అభ్యుదయ సంఘాలన్నిటితో కలిసి కృషి చేయడం మనవంతు బాధ్యత. గ్రామాల్లో ఈనాటికీ ఇంకా క్షుద్రపూజలు, లంకెబిందెలు, బాణామతి, చెడుపు, చిల్లంగి లాంటివి కొనసాగుతుంటే, తాయెత్తులు, ధనలక్ష్మి యంత్రాలు, దివ్యశక్తి గల ఉంగరాలు, జ్యోతిష్య హస్తసాముద్రికాలు, వాస్తు మొదలైన వ్యాపారాలు ప్రసార మాధ్యమాల్లో ప్రకటనలిచ్చే స్థాయికి ఎదిగిపోయాయంటే వ్యవస్థలోని వైజ్ఞానిక శాస్త్రీయాలోచనా వైఖరి ఎంతలా దిగజారిపోతోందో తెలుస్తోంది. సాక్షాత్తూ ప్రభుత్వాలే వర్షాలకోసం యజ్ఞయాగాలు, ఉపగ్రహాల విజయానికి పూజలు జరిపే దౌర్భాగ్యస్థితి నెలకొని ఉంది.

ప్రశ్నించడం నేర్పించాల్సిన విద్యాసంస్థలు అనుసరించడాన్నే ప్రోత్సహిస్తున్నాయి. ఆలోచనల్ని పదును పెట్టాల్సిన విద్యావిధానాలు సంకుచితత్వాన్ని పెంపొందిస్తూ, మొత్తంగా బాల్యంలోనే సృజనాత్మక ధోరణులకి గండికొడుతున్నాయి.

నిరాధార, అహేతుక, అశాస్త్రీయాంశాలు ప్రమాదకర స్థాయిలో అభివృద్ధి చెందుతూ సమాజాన్ని ముందుకు సాగనివ్వడం లేదు. సొంతంగా ఆలోచించడం ఒంటరితనంతో కూడిన నిరాదరణీయ ప్రక్రియగా అమలవుతోంటే, పదిమందినీ అనుసరించడం గౌరవించదగ్గ నాగరిక లక్షణంగా ప్రోత్సహించబడుతోంది.

ఇదిలాగే కొనసాగితే భావితరాలవారందరూ భావ బానిసలుగా మారి బతుకుల్ని వెళ్ళదీస్తారేమో కాని ఆత్మగౌరవంతో సజీవంగా, సగౌరవంగా హుందాగా జీవించలేరు. హేతువాదం లేని మానవత్వం పశుప్రాయం. ఏది మంచో, ఏది చెడో మనిషి తన విజ్ఞతనుపయోగించి మాత్రమే తెల్సుకోగలడు. అలాంటి విజ్ఞతని జిజ్ఞాసాత్మక మార్గంలో ప్రేరేపించే ఐచ్ఛిక లక్షణాన్నే హేతువాదమంటాం. సమాజంలోని మంచి చెడుల్ని బేరీజు వేసుకొని, మంచిని పెంచడానికీ, చెడును తుంచడానికీ ఈ విధమైన వైజ్ఞానిక దృష్టి అవశరం. దాన్ని నిరోధించే మూఢాచారాల్ని, మూర్ఖ సంప్రదాయాల్ని వ్యతిరేకించడం, రూపు మాపడానికి ప్రయత్నించడం మానవీయ స్పృహలో ఒక భాగం.

కాబట్టీ, ఎంతోకాలం నుంచి మన సంఘాన్ని పట్టి పీడిస్తున్న ఈ అనాగరిక జాడ్యాల్ని నిర్మూలించడానికి మనవంతు ప్రయత్నంగా 'మూఢాచారాల నిరోధక చట్టాన్ని' (Prevention and eradication of human sacrifice and other inhuman, evil and aghori practices and black magic Act - 2013) ని మన రాష్ట్రానికి కూడా తక్షణం వర్తింపచేయాలని విద్యాధికులు, మేధావులు, ప్రజాహిత శ్రేయోభిలాషులందరూ డిమాండ్ చేయడం జరుగుతోంది. న్యాయమైన ఈ కృషిలో భాగస్వాములవ్వాలనుకునే వారికోసం సాదర స్వాగతం పలుకుతోంది ప్రశ్న అధ్యయన వేదిక.

ప్రచురణ

**ప్రశ్న అధ్యయన వేదిక**

# ప్రజా రవాణా వ్యవస్థను కాపాడుకుందాం!

**మానవ** నాగరికత అభివృద్ధిలో ప్రయాణానిది ప్రధాన పాత్ర. చరిత్ర పరిణామంలో ప్రయాణానికున్న పాత్రెంత ముఖ్యమైనదో, ఆధునిక సమాజ రూపకల్పనలో రవాణారంగం పాత్రంత శక్తివంతమైనది. వాడుతున్న వాహనాల ఖరీదు, పరిమాణాన్ని బట్టీ వ్యక్తుల సాంఘిక స్థాయి నిశ్చయించబడుతోన్న ప్రస్తుత సమాజంలో ప్రయాణాన్ని కూడా ప్రజాస్వామీకరించుకోవడం అత్యంతవసరం. ప్రపంచీకరణ ప్రభావంతో రవాణారంగం కూడా సామాన్యులకు దూరమేయ్య పరిస్థితి వచ్చింది. సాధారణ ఆర్టీసీ బస్సుల్ని తగ్గించి డీలక్స్, సూపర్ డీలక్స్, ఎక్స్‌ప్రెస్, వోల్వో తరహా బస్సుల్ని పెంచడం, రైళ్ళలో నామమాత్రపు జనరల్ భోగీల్ని పెట్టి, తత్కాల్, ప్రీమియం తత్కాల్ పేరుతో రిజర్వేషన్ సీట్లనే అక్రమంగా అమ్ముకొంటూ, ఏసీ భోగీల్ని, రైళ్ళనీ పెంచుతూండటం పాలకుల దోపిడీ పన్నాగాలకి స్పష్టమైన నిదర్శనం. కాళ్ళూ చేతులు ఎంత తక్కువగా ఉపయోగిస్తే అంతెక్కువ నాగరికతనే భ్రమలో బ్రతుకుతున్న యువతరం కార్లూ, బైకుల్ని వీలైనంత విచ్చలవిడిగా కొనుగోలు చేస్తూ కార్పొరేట్ కంపెనీల్ని పోషిస్తోంది. అసమానతలతో నిండిన భారతీయ వ్యవస్థలో వాహనాల వినియోగం భౌగోళిక ప్రదేశాల మధ్య ప్రయాణించే సమయాన్ని తగ్గించే సాధనంగా కాక భౌతిక హోదాను ప్రదర్శించుకునే ఆడంబరంగా తయారైంది. అందుకే, నలుగురితో కలిసి సమిష్టిగా జీవించడం చులకనగా చూడబడుతోంటే ఎవరికి వారు విడిగా ప్రత్యేకతను ప్రదర్శించుకోవడం గొప్పగా కనిపిస్తోంది. తక్కువ కాలుష్యంతో, వనరులతో కూడిన ప్రజారవాణా వ్యవస్థ రోజురోజుకీ బలహీనపడుతూ, అత్యధిక పర్యావరణ కాలుష్యానికీ, అనేక రోగాలకీ, చమురు తదితర ఇంధన వనరుల విచ్చలవిడి వినియోగానికి, రద్దీ మొదలగు సమస్యలకి కారణమైన వ్యక్తిగత వాహనాల వాడకం పెరిగిపోతోంది. భూగోళంపై ఉష్ణోగ్రతలు మితిమీరి పెరగడం మొదలుకుని జీవావరణ వైవిధ్యం దెబ్బతిని వాతావరణ సమతుల్యత నశించడం వరకూ ఈ వ్యక్తిగత వాహన వినియోగం వల్ల తలెత్తిన సమస్యలెన్నో ఉన్నాయి. పూటకో కొత్త రూపంలో అవతరిస్తున్న నూతన వాహన శ్రేణి దేశంలోని పేద

మధ్యతరగతి జనాల్ని ఆకర్షించి వ్యాపారాన్ని పెంచుకోవడమే లక్ష్యంగా నడుస్తున్నదే కాని ప్రజాప్రయోజనాల్ని పట్టించుకునేది కాదు. ప్రభుత్వాలు, కంపెనీలు కలిసికట్టుగా ఆడుతున్న ఈ నాటకంలో సమిధలవుతున్న సామాన్య ప్రజలు ఇప్పటికైనా మేలుకోవడమవసరం. అందులో భాగంగానే, ప్రజారవాణా వ్యవస్థను మరింత పటిష్టం చేసుకోవాల్సిన బాధ్యత మనందరిమీదా ఉంది. అత్యవసర పరిస్థితుల్లో తప్ప వ్యక్తిగత వాహన వినియోగాన్ని పూర్తిగా విడనాడటం, కార్లు-బైకులకు బదులు పబ్లిక్ బస్సులూ, రైళ్ళను వినియోగించుకోవడం, చిన్నప్పట్నుంచే పిల్లలకు నడక, సైకిళ్ళ ద్వారా ఆరోగ్యకరమైన అలవాట్లు పెంపొందించడం, పాఠ్యాంశాల్లో సమిష్టి జీవనవిధానంపై ఆసక్తికర పాఠాల్ని రూపొందించడం, ప్రజాప్రతినిధులు, ఉన్నతాధికారులు, రాజకీయ నాయకులు ఆడంబరమైన విలాస వాహనాల వాడకాన్ని మాని సులభశైలిలో ఆదర్శప్రాయంగా జీవించడం, సామాజిక కార్యకర్తలు, మేధావులు, పౌర సమాజం, స్వచ్ఛంద సంస్థలు, ప్రజాసంఘాలు ఈ విషయంపై స్పందించడం, విద్యార్థులు - యువత ఈ సమస్యపై చిన్న బృందంగా ఏర్పడి చర్చించడం మొదలగు కార్యక్రమాలన్నీ చేయదగినవే. ముఖ్యంగా ప్రభుత్వం ఈ అంశంలో తక్షణ చర్యలు తీసుకుని ప్రజలందర్నీ ఈ కార్యక్రమంలో భాగం చేసుకునే ప్రయత్నం చేయాలి. ఇందుకోసం బృహత్తర ప్రణాళిక ద్వారా విస్తృతమయిన ప్రచార కార్యక్రమాల్ని రూపొందించాలి. మితిమీరిన వాహన వినియోగం కూడా వో తరహా సాంఘిక ద్రోహమనే స్పృహ ప్రజానీకంలో రావాలి. మీడియా, ప్రసారమాధ్యమాలు సైతం యిందులో భాగమవ్వాలి. ప్రజారవాణా వ్యవస్థను మరింత బలోపేతం చేసుకోవడం కోసం ఎవరికి వారు తమవంతు కర్తవ్యంగా ప్రచారోద్యమంలో భాగం కావాలి. బాధ్యతగల పౌరులుగా ఇది మనందరి కనీస విధి. రండి, ప్రజా రవాణా పరిరక్షణా ప్రచారోద్యమంలో భాగస్వాములవుదాం.

**ప్రజా రవాణా పరిరక్షణ సమితి**

(Committee For Support Public Transport)

ఆంధ్రప్రదేశ్ - తెలంగాణ

# సంపూర్ణ మద్యపాన నిషేధాన్ని తక్షణం అమలు చేయాలి

**మద్యం** మన వ్యవస్థకి దాపురించిన వినాశకర సమస్య. సమాజంలో దినదినానికీ దిగజారిపోతున్న నైతిక విలువలకు, క్షణక్షణానికీ క్షీణించిపోతున్న మానవ సంబంధాలకూ మద్యమే ముఖ్య కారణం. సమాజంలోని భయంకరమయిన రోగాలకు, రోడ్డు ప్రమాదాలకు, స్త్రీలపై జరుగుతున్న నేరాలకు, మత్తు కారణంగా యువత పాల్పడే ఘోరాలకు మద్యమే ప్రధానం. ఈ వ్యసనానికి బానిసలై బతుకుల్ని చేజేతులా మంటగలుపుకుంటున్నవారి వల్ల కూలిపోయిన కుటుంబాలు, ఆగిపోయిన చదువులు, వీగిపోయిన జీవితాలకు లెక్కేలేదు. అన్యాయాన్ని నేరంగాకాక ఆదాయంగా చూడ్డం అలవాటైన సమాజం అక్రమార్జనని ఆర్థిక సుస్థిరతగా భ్రమిస్తుంది. తన ఖజానా నింపుకోవడం కోసం మందిచేత మద్యం తాగించడం అమానుషం. మన దేశంలో, రాష్ట్రంలో ఈ అఘాయిత్యం ప్రభుత్వాల చేత అధికారికంగానే అమలౌతోంది. ఒక పక్క సామాన్యుల్ని నాశనం చేసే మద్యపానాన్ని పరోక్షంగా ప్రోత్సహిస్తూ, మరో పక్క వారి అభివృద్ధి కోసం సంక్షేమ పథకాల్ని ప్రవేశపెట్టే పాలకుల ద్వంద్వ వైఖరికి వర్తమాన వ్యవస్థని మించిన ఉదాహరణ మరోటి లేదు. ప్రజల బలహీనతని ఆసరాగా తీసుకుని బడుగుల బతుకుల్ని బుగ్గిపాలు చేసే వ్యసనాల్ని ఆర్థిక సౌలభ్యం పేరుతో చట్టబద్ధంగా సమర్థించుకోడాన్ని మించిన సిగ్గుమాలినతనం ఇంకోటి లేదు.

మద్య నిషేధానికి సంబంధించిన చర్చ వ్యవస్థలో ఎప్పుడు తలెత్తినా వీలైనన్ని వేషాలేసి దాన్ని తెలివిగా పక్కదారి పట్టించే ప్రయత్నాలు విజయవంతంగా జరుగుతుంటాయి కాబట్టే, ఈరోజు మద్యనిషేధమనేదొక అసాధ్యమైన విషయంగా మనకి కనబడుతోంది. దేశంలోనే ఎక్కువ శాతం మద్యాన్ని వినియోగించే పొరుగు రాష్ట్రమైన కేరళలో మద్య నిషేధాన్ని ప్రకటిస్తే, ఇక్కడది సాధ్యం కాదంటూ ప్రభుత్వం కుంటి సాకులు చెబుతోందంటే, మన రాష్ట్రం ఈ మత్తులో ఎంత లోతుగా కూరుకుపోయిందో అర్థం చేసుకోవచ్చు. నిషేధం వలన పక్క రాష్ట్రాల నుండి అక్రమ మద్యం రవాణా అవుతుందనీ, సారాయి, ఇతర ప్రమాదకర మాదక ద్రవ్యాల వాడకం పెరిగిపోతుందనీ, హఠాత్తుగా నిషేధించడం వల్ల ఈసరికే వ్యసనపరులైనవారికి ఆరోగ్య సమస్యలొస్తాయనే కారణాల్ని ప్రభుత్వం చెబుతోంది. ఇవన్నీ బొత్తిగా శుద్ధ అవాస్తవాలని ఎవరూ కొట్టిపారేయరు కానీ, నిజంగా నివారించాలనే చిత్తశుద్ధుంటే

ఇవన్నీ పాలకయంత్రాంగం పరిష్కరించలేనంత గొప్ప సమస్యలు కావేమో ఆలోచించాలి. ఈ అంశంపై ఈసరికే జరిగిన కృషినీ, అధ్యయనాల్ని పరిశీలించడం ద్వారా, ఈ సమస్యపై ఎంతోకాలంగా పనిచేస్తున్న సామాజిక స్వచ్ఛంద సంస్థల అనుభవాల్ని, కమిటీ నివేదికల్ని బేరీజు వేయడం వల్లా ఈ విషయంలో అనుసరించాల్సిన వైఖరిపై స్పష్టత ఏర్పర్చుకోవచ్చునని గుర్తించాలి.

చట్టవిరుద్ధమైన బెల్టు షాపుల్ని చట్టబద్ధంగా తొలగిస్తామనే హాస్యాస్పద వాగ్దానాన్ని ఆడంబరంగా చేసి అట్టహాసంగా అధికారంలోకొచ్చిన ప్రభుత్వం ఆచరణలో దారుణంగా విఫలమైంది. అందుకే, అడుగడుగునా ఈ గొలుసు దుకాణాలు నిబంధనలకు విరుద్ధంగా నడుస్తూ మామూలు ధరకంటే ఎన్నోరెట్లు ఎక్కువ సొమ్మును వసూలు చేస్తూ జనాల్ని అడ్డంగా లూటీ చేస్తున్నాయి. ఆమ్యామ్యాలకలవాటుపడ్డ అబ్కారీశాఖ అప్పుడప్పుడు గ్రామాల్లోని అమాయకులపై దండెత్తి నాటుసారా బట్టీల్ని పగులకొట్టి పత్రికలకెక్కడంలో చూపే ఆసక్తి, బ్రాందిషాపుల అక్రమాలని అరికట్టడంలో చూపకపోవడంతో మద్యం దందాలు యధేచ్ఛగా పెరిగిపోతున్నాయి. ప్రజల ప్రాణాలతో చెలగాటమాడే వ్యసనాలపై ఆధారపడి ప్రభుత్వాలు ఆదాయాల్ని సమకూర్చుకోవడం ప్రజాస్వామ్యానికే కళంకం. పేదల జీవితాల్ని మొదలకంటా చిదిమేసేలా తాగుబోతుల్ని పోషించడం ఆధునికతకే అత్యంత అవమానకరం. బాలకార్మిక వ్యవస్థ మొదలుకుని స్త్రీలపై బలాత్కారాల దాకా సంఘంలో అసాంఘిక కార్యక్రమాలన్నిటిలోనూ కనిపించేది అంతర్లీనంగా మద్యపానమనే వ్యసనమే. విద్యార్థులు, యువత, నిరుద్యోగులు, చిరుద్యోగులు, రైతుకూలీలు, రోజుకూలీలు, బడుగు వ్యాపారులు, బలహీనవర్గాలు... ఎందరో ఈ మహమ్మారి బారిన పడి జీవచ్ఛవాల్లా బతుకీడుస్తున్నారు.

ఈ పరిస్థితి మారాలి. మనమందరం మద్యపాన సమస్యపై పెద్దఎత్తున స్పందించాలి. ఎక్కడికక్కడ స్థానిక మహిళల్తో సంఘటితమై పాలకుల కుటిల వైఖరిని నిరసిస్తూ పోరాడాలి. భవిష్యత్తులో మన పిల్లలైనా మద్యరహిత వ్యవస్థలో ఆరోగ్యకరంగా జీవించడానికి ఇప్పట్నుంచే మద్యాన్ని వెంటనే పూర్తిగా, శాశ్వతంగా నిషేధించమని ప్రభుత్వాన్ని డిమాండ్ చేయాలి. నాగరికతనేది మనుషుల్లో వుంటుందేకాని మత్తులో కాదని ప్రచారం చేయాలి. మనవీయ స్పృహతో బాధ్యతగా మనతరం ముందడుగేయాలి.

**- సహవాసి స్వాభిమాన వేదిక**

## అధ్యాపకులకో వినతి-విద్యావంతులకో విజ్ఞప్తి

**చెబితేనే** చదువొస్తుందనే విషయాన్ని స్వచ్ఛందంగా విస్మరించుకున్న వ్యవస్థలో కొడితేనే చదువబ్బుతుందనే గొడ్డుసూత్రం చలామణీ అవుతోంది. కుదిరినన్ని ఎక్కువ పుస్తకాల్తో అధిక మొత్తంలో ఫీజులు చెల్లిస్తూ ఫలానా ప్రైవేటు స్కూల్లో పిల్లల్ని చదివించడం తల్లితండ్రులందరిచేత భగీరథ ప్రయత్నంగా భావించబడుతోంది. సమాజంలో జీవించడానికి ఎందుకూ అక్కరకు రాని వ్యర్థాంశాలన్నీ, పాఠ్యాంశాలుగా మారి పిల్లలమీద బోధన రూపంలో రుద్దబడుతున్నాయి. కుటుంబ సభ్యులకి నీరసమొస్తే ఏం చేయాలో తెలీక నీళ్ళు నమిలే వాళ్లు డాక్టర్లుగానూ, ఇంట్లో మీటర్‌కి ఫ్యూజువైరు వేయడం కూడా రానివారు ఇంజినీర్లుగానూ ఉద్యోగాలు పొందడం ఎక్కువైపోతోంది. ఈ పరిస్థితిలాగే కొనసాగితే మరికొంత కాలానికి వ్యవస్థలో ఆలోచనా వంధ్యత్వం సంభవిస్తుంది.

స్వతంత్రంగా నిర్ణయం తీసుకోవడమనే లక్షణాన్ని తీవ్రవాద గుణంగా ప్రచారం చేసే తరగతి గదిలో పిల్లలు ప్రతీ చిన్న విషయానికి పెద్దల ఆదేశాల కోసం ఎదురుచూసే మంద బుద్ధులుగా రూపొందుతారు. తెలీని విషయాల్ని ఒప్పుకునే స్వభావం, నేర్చుకునే నిజాయితీ లేని అధ్యాపకులు ప్రశ్నించడం ఒక తరహా నేరమనే భావం పిల్లల మనసుల్లో నాటుకునేలా దండించడం వల్ల చిన్న వయసులోనే చాలామంది పిల్లల్లో అస్వాభావికమైన ఆటవికత్వం, అవివేకంతో కూడిన సంకుచితత్వం వృద్ధి చెందుతాయి. అసమానతల్తో నిండిన మన సామాజిక చట్రంలో కుటుంబ కలహాలు, తల్లితండ్రుల ఆధిపత్యం, వ్యసనాలు, ఆర్థిక అవాంతరాలు, కులమత సంబంధ సంప్రదాయాలు, మూఢ నమ్మకాలు, లైంగిక విషయాలు మొదలైనవి కూడా పిల్లల మనసులపై ప్రభావం చూపుతాయి.

చెప్పేవాటికంటే చేసే పనుల బట్టే పిల్లలెక్కువ నేర్చుకుంటుంటారు. సాధారణంగా తరగతి గదిలో ఆదర్శాలు వల్లించే అధ్యాపకులు ఎక్కువమంది

ఆచరణలో చిత్తశుద్ధి లేనివారుగా వుండటం మూలంగా, చెప్పేవాటికి పొంతన లేకపోవడం, అబద్ధాలు చెప్పడం, అరవడం, గొప్పలు చెప్పుకోవడం, బాధ్యతగా లేకపోవడం, సమయపాలన లేకపోవడం, సోమరితనం, అత్యాస మొదలగు గుణాలు పిల్లల్లో పెంపొందుతాయి. పాఠశాల్లో సమిష్టి సంబంధాల్ని బలపర్చే కలసికట్టు కార్యక్రమాలైన ఆటలు, పాటలు ఇతర వినోద క్రియల్ని పిల్లల్లో ప్రోత్సహించకుండా, కేవలం పరీక్షలకి తర్ఫీదయ్యే నిరంతర యంత్రాలుగా విద్యార్థుల్ని పరిగణించడం వల్ల మార్కులకోసం పాఠాల్ని పదేపదే నెమరువేసుకునే నాగరిక శుంఠలుగా అవుతున్నారే కాని శారీరక, మానసిక నైపుణ్యాల్ని మెరుగుపర్చుకునే వ్యక్తులుగా తీర్చిదిద్దబడ్డం లేదు. ఈ పద్ధతిలో చదవటం వల్ల నిర్దేశించబడిన విషయాల్ని బట్టీపట్టి ఉద్యోగాల కోసం మాత్రమే విద్యార్జన చేసే బానిసలుత్పన్నమవుతున్నా సజీవ వ్యక్తులు అంతరిస్తున్నారు.

విద్యాలయాలనేవి నిరుద్యోగ యువతకి ఉపాధి కల్పించేందుకు, విద్యార్థులకి ఊకదంపుడు ఉపదేశాలిప్పించేందుకు తప్ప విద్యార్థుల్ని ఉన్నతంగా తీర్చిదిద్దడానికి ఉపయోగపడ్డం లేదు. అనుభవాన్ని మించిన జ్ఞానం లేదనే విజ్ఞతలేనివారంతా ఉపాధ్యాయ ఫోజు కొడ్తూ అక్షరాల్నీ – పుస్తకాల్నీ మాత్రమే విలువైన జ్ఞానాంశాలుగా భావించడం మూలాన విద్యార్థుల ప్రతిభకి పరీక్షల్లోని మార్కులే ప్రమాణంగా చూసే దౌర్భాగ్యం దాపురించింది. ఈ స్థితిని దూరం చేయడానికి తల్లితండ్రులు, ఉపాధ్యాయులు అందరూ ప్రయత్నించాలి. శ్రమపట్ల గౌరవాన్ని, జ్ఞానంపై అభిలాషని పిల్లలకి కల్గించాలి. విద్యార్థుల్లోని అంతర్గత సృజనాత్మక జిజ్ఞాసని సర్వోన్నతంగా, నైతికంగా నిర్మించడమే విద్యయొక్క ముఖ్య లక్షణమని గ్రహించాలి. విద్యావంతులందరూ ఆలోచించి మారాలి.

**సమతా విద్యామండలి**
(తెలంగాణా – ఆంధ్రప్రదేశ్)

# మద్యపాన విధ్వంసాన్ని ఎదిరిద్దాం

**తాగడమనేది** నాగరికతకి ప్రధానమైన అర్హతగా చూడబడుతున్న సమాజంలో తాగకపోవడం అనాగరికతకి ప్రమాణమైంది. ఒళ్ళొంచడానికి సిగ్గుపడే మధ్యతరగతి జనాల నుంచి రెక్కలు ముక్కలు చేస్తేగాని మెతుకురాని కష్టజీవుల వరకూ అందరూ మద్యం దుకాణాల్ని మౌనంగా పెంచి పోషిస్తున్నారు. తాగుబోతు లక్షణాన్ని విలక్షణంగా చూపిస్తున్న ప్రసారమాధ్యమాల ప్రభావంతో విద్యార్థులు, యువత కౌమారదశలోనే ఈ నాగరిక రోగం బారినపడుతున్నారు. వాస్తవ దృష్టిలేని వ్యవస్థ అవాస్తవికతని ఆరాధించడానికే మొగ్గు చూపుతుంది. అందులో భాగంగానే ఎక్కువమంది ప్రజలకి పనికొచ్చే కనీసవశరాల్ని కల్పించలేని ప్రభుత్వం, పనికిరాని విలాసాల్ని ఆకర్షణీయంగా వారిపై రుద్దడం ద్వారా సంఘంలోని అసమానతల్ని ప్రజలెప్పటికీ గుర్తించకుండా మభ్యపెడుతోంది. నిర్బంధవిద్యకి నీళ్ళొదిలేసి, ప్రభుత్వ వైద్యాన్ని పడకన పడేసిన పాలకులు, నాణ్యమైన విద్యా-వైద్యాల్ని కార్పొరేట్ సంస్థలకు టోకుగా అమ్మేసుకున్నారు. నిత్యావసరాల ధరలు, నిరుద్యోగుల సంఖ్య విపరీతంగా పెరిగినా పట్టించుకోకుండా ఉండలనే మందిపై మద్యం పోస్తున్నారు. అత్యధికశాతం రోగాలు, నేరాలు, రోడ్డు ప్రమాదాలే కాకుండా, దళిత బహుజనులపై, స్త్రీలపై, పిల్లలపై అత్యాచారాలు కూడా మద్యం కారణంగానే జరుగుతున్నాయి. మహిళల్ని కించపర్చడమే 'మగతనం'గా భావించే సంస్కృతిలో పాలకవర్గం నుండి వేరయి ప్రత్యేక పురుషాధిక్యతనేదీ వుండదు. మగాళ్ళ తాగుడు కారణంగా కుప్పకూలిపోతున్న లెక్కలేనన్ని నిరుపేద కుటుంబాల్లోని స్త్రీలు, పిల్లల పరిస్థితి చెప్పలేనంత దుర్భరంగా వుంటోంది. డబ్బుల కోసం ప్రమాదకరమయిన మాదక ద్రవ్యాల్ని దొంగచాటుగా అమ్ముకునే అక్రమ వ్యాపారులతో పోల్చిచూస్తే, ఆదాయం కోసం వినాశకరమయిన మద్యాన్ని బహిరంగంగా అమ్ముకునే అధికార నాయకులెంత పెద్ద నేరస్తులో అర్థమౌతుంది. ఒకవైపు మద్యంతో జనజీవితాల్ని అతలాకుతలం చేస్తూ, మరోవైపు సంక్షేమ కార్యక్రమాలతో అదే జనాన్ని అభివృద్ధి చేస్తామనటం ఏలినవారి రెండు నాల్కల ధోరణికి తిరుగులేని నిదర్శనం. ప్రజాస్వామ్య ఔన్నత్యం అందులోని పౌరులెంత చైతన్యవంతులనే విషయాన్ని ప్రామాణికంగా తీసుకుని బేరీజు వేయాలేకాని

ఎంతమందిని మత్తులో ముంచి ఎంతాదాయం రాబట్టామనే వ్యాపార సూత్రంతో కాదు.

స్వేచ్ఛగా ఆలోచించడం, స్వతంత్రంగా ప్రశ్నించడమనే లక్షణాల్ని తీవ్రవాద గుణాలుగా పరిగణిస్తున్న సమాజంలో సంకుచితంగా అనుసరించడం, స్వచ్ఛందంగా మౌనం వహించటం మర్యాదస్తుల గుణాలుగా చలామణీ అవుతుంటాయి. కూడు, గుడ్డ, గూడుల గురించి మాట్లాడని ప్రభుత్వం, స్వచ్ఛత, శుభ్రత, పవిత్రత పేరుతో కబుర్లు చెబుతోంది. అపరిమితమైన శుభ్రత అగ్రవర్ణ బ్రాహ్మణీయ భావజాలం నుంచొచ్చిన జాడ్యం. కంప్యూటర్ల ముందు కూర్చొని శ్రామికుల రక్తం పీల్చేవారికీ, కారుల్లో తిరుగుతూ కార్మికుల కడుపు కట్టేవారికీ తప్ప కోట్లాది కష్టజీవులకి ఈ రకమయిన 'మడి' కట్టుకోవడం వల్ల కడుపు నిండదు. దేశంలోని లక్షలాది గ్రామాల్లో ఇంకా దళిత బహుజనుల్ని ఊరికి దూరంగా పెడుతూ, వారిపై క్రూరమైన దాడులు చేస్తూ, అప్రకటిత అంటరానితనాన్ని పాటించే వారికున్న మానసిక మాలిన్యం బీదప్రజలకి లేదు. కాబట్టి, దేశాన్ని పట్టిపీడిస్తున్న పేదరికం, నిరుద్యోగం, అసమానత్వం మొదలైనవాటికి సరైన పరిష్కారాలకోసం నిజాయితీగా కృషి చేయకుండా పరిశుభ్రతనే నినాదాన్ని ఆడంబరంగా ప్రదర్శించడం సబబు కాదు. 'స్వచ్ఛభారత్' పేర్తో మందిని మత్తులో ముంచి దేశాన్ని కాషాయీకరించాలనే కుట్రలో భాగంగానే మద్యాన్ని ప్రోత్సహించడం జరుగుతోంది. బూతు ప్రసారాలతో, రోత సంస్కృతితో నేటితరం బుర్రల్ని పాడుచేసి వార్ని భావబానిసల్ని చేయడం విద్వేషశక్తుల విషలక్ష్యం. ప్రజానీకాన్ని మత్తుకి దాసుల్ని చేసి నిలువుదోపిడీ చేస్తున్న ఈ నయానియంతలని ఎదురుకోవడం ప్రజాస్వామిక విలువల్ని ఆశించేవారందరి కర్తవ్యం. అందుకే, మద్యపాన విధ్వంసాన్ని సమిష్టిగా ఎదిరిద్దాం. ఈ నిషాని నిషేధించేంత వరకూ అవిరామంగా గళమెత్తి పోరాడుదాం. భావితరాల వారికైనా ఆరోగ్యకరమయిన వ్యవస్థని వారసత్వంగా అందిద్దాం.

**సర్వజన సమతా మండలి**

## దెయ్యాలు, ఆత్మలు ఒట్టి బూటకాలు!
## అతీత శక్తుల కథలన్నీ అసాంఘిక శక్తుల నాటకాలు!!
## మహిమలున్నాయని నిరూపిస్తామనే వారికి హేతువాదుల సవాల్!!!
## పదికోట్ల రూపాయల బంపర్ బహుమతి!!!!

**ఆచరణలో** ఆధునిక శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం కోసం వెంపర్లాడే మనం ఆలోచనల్లో ఇంకా అనాగరికులుగానే ఉన్నాం. అందుకే, నాగరిక సమాజంలో జీవిస్తూ కూడా మూఢ నమ్మకాలపై ఆధారపడుతున్నాం. సొంతంగా ఆలోచించే ధైర్యంలేక, ప్రశ్నించేందుకు ధైర్యం చాలక సంప్రదాయ బానిసత్వాన్ని సంస్కృతి పేరుతో సంరక్షించుకుంటున్నాం. తరతరాలుగా మానసిక అణిచివేతతో మొద్దుబారిన మన మెదళ్ళు, స్వచ్ఛందంగా చీకట్లో మగ్గిపోవడానికి అలవాటుపడి కాంతిని చూసేందుకు కళ్ళురాక వెలుగంటేనే వెగటుపడే స్థితికి చేరుకున్నాయి. పాలకవర్గాల దోపిడీ వ్యవస్థ తనని వ్యతిరేకించని మనస్తత్వాల్నే పౌరసత్వంగా భావిస్తుంది. అందుకే ప్రశ్నంటేనే దానికి భయం వేస్తుంది. ప్రశ్నించేవారంటే ఒళ్ళు జలదరిస్తుంది. సమాజంలో అసమానతలు, అధిక ధరలు, నిరుద్యోగం, పేదరికం, అనారోగ్యం, అశ్లీలత, స్త్రీలపై దౌర్జన్యాలు, దళిత మైనారిటీలపై అణిచివేత, వెర్రితలలు వేస్తున్న వినిమయతత్త్వం మొదలైన వాటిని గురించి ప్రజలు ఆలోచించకుండా ఉండడానికి రకరకాలయిన అంధ విశ్వాసాల్ని గుప్పించడం జరుగుతుంది.

చాలాకాలం క్రితం రాష్ట్రంలో పెద్ద ఎత్తున జరిగిన 'వో స్త్రీ రేపురా' ప్రచారం, ఢిల్లీలో వింతకోతి దాడులు, వినాయకుడి విగ్రహాలు పాలు తాగడం, విదేశాల్లో ఎగిరేపళ్ళాల కథలు, దేవుళ్ళ ఫోటోల నుంచి విభూతి తదితర పదార్థాలు రాలడం, మంత్రాలు, పూజలు, స్వస్థత ప్రార్థనల ద్వారా మానసిక, శారీరక, లైంగిక, వైవాహిక, సాంఘిక సమస్యలు తీర్చడం, మనుషులపై ఆత్మలు వాలడం, మనుషుల్లోకి మరో మనిషి పరకాయ ప్రవేశం చేయడం, బాబాలు, అమ్మలు, స్వామీజీలు, యజ్ఞయాగాలు,

క్షుద్రపూజలు, బాణామతి, చేతబడి, చెడుపు, చిల్లంగి, జాతకాలు, జ్యోతిష్యం, వాస్తు, యోగా, ధ్యానం, మందుపెట్టడం, వశీకరణ, భూతప్రేత పిశాచాల కథలు, లంకెబిందెలు, నిధి నిక్షేపాల కోసం జరిగే పిచ్చి పిచ్చి తంతులు, ప్రసార మాధ్యమాల్లో జరుగుతున్న మహత్తుగల ఉంగరాలూ, తావీజులు, దిష్టి యంత్రాల ప్రకటనలు లాంటివన్నీ అవాస్తవాలే. కేవలం కొంతమంది కడుపు నింపడం కోసం అత్యధిక శాతం జనాల కడుపుకొట్టే తతంగంలో భాగమే ఇవన్నీ. వీటిపై ఆధారపడి బతికేవారంతా మోసగాళ్ళు, సాంఘిక దొంగలే.

నీతిలేని వ్యక్తులు ఆర్థికంగా ఎదగడానికి అక్రమదారులు వెతుక్కుంటారు. అలాంటి సోమరిపోతులకి ఇలాంటి వ్యవహారాలు బాగా ఉపయోగపడతాయి. ఏ పనీ చేయకుండా, సమాజం గురించి అసలేమాత్రం పట్టించుకోకుండా మహిమలపై ఆధారపడి మనుగడ సాగిస్తుంటారు ఈ మంద. ఈ రకమయినమహిమలన్నీ మ్యాజిక్ జిమ్మిక్కులేనన్న నిజం తెలియని అమాయకులంతా వీళ్ళ గారడీలకి మోసపోతుంటారు. ఈ విశ్వంలో మహిమలనేవి లేవు. అతీత శక్తులు అసలే లేవు. రోజురోజుకీ పెరుగుతున్న వైజ్ఞానిక దృక్పథాన్ని తట్టుకోలేని మతోన్మాద ఛాందసులు, కులపిచ్చిగల దురాభిమానులు, భక్తి పేరుతో వ్యాపారం చేసే జలగలు మాత్రమే మహిమల ప్రచారం చేస్తూ ప్రజానీకాన్ని అజ్ఞానంలో ఉంచే ప్రయత్నం చేస్తున్నారు. శాస్త్రీయ దృక్పథాన్నీ, వైజ్ఞానిక వైఖరినీ, సత్యాన్వేషణాతృష్ణనూ, స్వేచ్ఛా పిపాసను హేతుబద్ధంగా పెంపొందించుకోనంతకాలం మానవజాతికి ఈ జాడ్యాల నుంచి విముక్తి లేదు.

**మహిమలున్నాయని నిరూపిస్తే, పదికోట్ల బహుమతి!**
**ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రజ్ఞులు, మీడియా మిత్రులు,**
**వైజ్ఞానికుల సమక్షంలో బహిరంగ పరీక్ష!!**
**సవాల్‌కు సిద్ధపడగలవారికిదే మా ఆహ్వానం!!!**

**- నాస్తిక, హేతువాద, భౌతికవాద సమాఖ్య**

# పుష్కరాల పుష్కల దోపిడీ

**రాష్ట్ర** ప్రభుత్వం పుష్కరాలకి ఎన్నివందల కోట్లో విడుదల చేసింది. అవి చాలక రాజమండ్రి నగర పాలక సంస్థ కొన్ని వందల కోట్లు కేటాయించింది. ఇవి కూడా చాలకపోతే కేంద్ర ప్రభుత్వం మరెన్నివందల వేల కోట్ల రూపాయిలయినా ఇలాంటి వాటికివ్వడానికి ఎప్పుడూ ముందుంటుంది. అయినా చాలకపోతే ప్రపంచ బ్యాంకెలాగూ వుండనే వుంది. పుష్కరాలకి విచ్చేసే కోట్లాది మంది భక్తులు తెలుసుకోవలసిన నిజమేంటంటే ఈ డబ్బులన్నీ కూడా మనవే. అంటే ప్రజలవే. రాష్ట్రంలో తాగునీటి సమస్య మొదలుకుని తిండి, ఆరోగ్యం, వైద్యం, విద్య, ఉపాధి ఉద్యోగావకాశాలపై ఎన్నడూ ఇంతెక్కువ నిధుల్ని ఒక్కసారే ఖర్చుపెట్టడానికి ముందుకురాని ప్రభుత్వం ఇంత హడావుడిగా ఎందుకు కోట్లకొద్దీ ప్రజాధనాన్ని వెచ్చించి అక్కర్లేని సౌకర్యాల్ని విచ్చలవిడిగా కల్పిస్తోందన్నది ప్రశ్నార్థకం.

నిజంగా ఇదంతా ప్రజలపై ప్రేమే ననుకుంటే పొరబాటే. ఈ దేశంలో ఇప్పటిదాకా పాలకాధికారాల్ని వెలగబెట్టిన ప్రభుత్వాలన్నీ అగ్రవర్ణ హైందువులవే. అంతేకాక ఎవరే మతం పుచ్చుకున్నా హిందూజాతి లక్షణమైన కులతత్వం - మతోన్మాదం త్వరగా పోవు. కొద్దోగొప్పో తెలివున్న దళిత బహుజనులు అంబేద్కర్‌ను అధ్యయనం చేయడం మొదలెట్టిం తర్వాతే హిందూత్వ వాదుల బండారాల్ని గుర్తించడం జరుగుతోంది. ఐనప్పటికీ ఈనాటికీ హైందవ మతశక్తుల ఆకర్షణలకి బహుజనులు బలైపోతున్నారు. దేశప్రజల్ని అలాంటి భ్రమల్లో ముంచి, అరచేతిలో అభివృద్ధి వైకుంఠాన్ని చూపించి అధికారంలోకి వచ్చిన మోడీ ప్రభుత్వం సమాజంలో తమ అస్తిత్వానికవసరమైన ప్రమాదకర భావజాలాన్ని పెంపొందించే కార్యక్రమాన్ని అమలు చేస్తుంటుంది.

అందుకు అన్ని మార్గాలను వాడుకుంటుంది. ఈ 'పుష్కరాల తంతు కూడా ఇందుకు మినహాయింపేం కాదు. చనిపోయిన పితరులకు పిండ ప్రదానాలు చేయడం వల్ల వారికి స్వర్గలోక స్థానం ప్రాప్తిస్తుందనేదే జనాభాలో 4 శాతమున్న అగ్రవర్ణ బ్రాహ్మణీయ వైదిక భావజాలంలో భాగమైన నమ్మకం. వారినే చూసి వాతలు పెట్టుకోవడం అలవాటయిన ఇతర అగ్రకులాల వారు పోనీ వారిననుసరించా

రనుకున్నా ఈ దేశ మూలవాసులైన దళిత బహుజన ఆదివాసి గిరిజన ప్రజలకి పుష్కరాలతో ఎలాంటి సంబంధమూ లేదు. ఆదివాసీ గిరిజనుల్ని సైతం హైందవంలోకి ఆకర్షించి ఇతర మతస్తులపై వారిలో విద్వేషాన్ని ప్రవేశపెట్టడం కూడా బ్రాహ్మణీయ ఫాసిస్టు మతోన్మాద ఎత్తుగడలో భాగమే.

"పిండములు చేసి పితరుల తలపోసి
కాకులకు పెట్టు గాడ్దెలార
పియ్యతినెడి కాకి పితరుడెట్లాయెరా?
విశ్వదాభిరామ వినురవేమ"

అంటాడు సామాజిక విప్లవకవి వేమన. 'యద్దినం తద్దినం నాస్తి తద్దినం మమ దుర్దినమ్' అని పురోహితులంతా భావిస్తారు. తద్దినం లేని రోజు పురోహితులకు గిట్టుబాటుగాని రోజని భావం. కాబట్టి, ఈ పిండప్రదానమనే ప్రక్రియ బ్రాహ్మణ పురోహిత వర్గాల్ని పరాన్నభుక్కుల్ని చేయడానికే గాని మరెందుకూ కాదు.

"రాతి బొమ్మకేల రంగైన వలువలు
గుళ్ళు గోపురములు కుంభములును
కూడుగుడ్డ తాను కోరునా దేవుడు
విశ్వదాభిరామ వినురవేమ."

పుష్కరాల సందడంటూ ప్రజాధనాన్ని వృధా చేస్తున్న పాలకులకి ఆనాడెప్పుడో వేమన చెప్పిన పద్యం చెంపపెట్టు. రాజ్యాంగంలో లౌకిక రాజ్యంగా నిర్వచించుకున్న దేశంలో మిగిలిన రెండు మైనారిటీ మత విశ్వాసాలకీ ప్రాధాన్యతివ్వని ప్రభుత్వం ఇన్నికోట్ల రూపాయిల ధనాన్ని కేవలం కొద్దిరోజులపాటు జరిగే ఉత్సవాల కోసం వెచ్చించడం, పైగా సమాజంలోని అసమానతల్నీ, అంటరానితనాన్నీ, ఆకలిదప్పుల్ని, నిత్యావసర వస్తువుల ధరల్ని, ఆదివాసీ గిరిజనులు, దళితులపై దాడుల్నీ, స్త్రీలపై అత్యాచారాల్ని, మద్యపాన సమస్యనీ ఏనాడూ ప్రతిష్టాత్మకంగా తీసుకుని పరిష్కరించే ప్రయత్నం చేయని ప్రభుత్వం ఈ మత పండగల్ని ప్రతిష్టాత్మకంగా తీసుకుమరీ ఎందుకు మందిసొమ్ము ఖర్చు పెడుతోందనేది సందేహాస్పదం.

ప్రకృతీ, పర్వతాలు, నదీజలాలు మానవాళి అంతటికీ చెందినవి. వాటిపై ఏ ఒక్క వర్గానికీ ఆధిపత్యముండదు. కొద్ది సంవత్సరాలకొకసారి అట్టహాసమైన ప్రచార ఆర్భాటాలతో చేసే పుష్కరాలు, కుంభమేళాలు ఈ దేశంపై గుత్తాధిపత్యం మాదేననే హిందూ మతోన్మాద మనస్సాక్షికి బహిరంగ ప్రకటిత రూపాలుగా అమలౌతున్నాయే

కాని లౌకిక ప్రజాతంత్ర స్ఫూర్తితో కాదు. ఇంకా వందలాది గ్రామాల్లో దళిత వాడల్ని ఊరికి వెలుపలే వుంచే మతం, లక్షలాది దేవాలయాల బయటే బహుజనుల్ని అట్టిపెట్టే మతం, క్రైస్తవులుగా, ముస్లిములుగా మారుతున్నందుకు క్రూరమైన దాడులు చేస్తున్న మతం, సనాతనత్వం పేరుతో కోట్లాదిమంది స్త్రీలని నాలుగ్గోడలకే పరిమితం చేసిన మతం, చార్వాకుల్ని చంపిన, బౌద్ధుల్ని రోట్లో రుబ్బిన, శంభూకుడి తల నరికిన మతం ఇలాంటి పుష్కరాలు ఎన్నింటినైనా చేసి సమాజంలోని అణగారిన పీడిత వర్గాలకి న్యాయం చేయగలదేమో ఆలోచించగలగాలి.

హిందూలంతా ఒక్కటేనన్న భావజాలం వ్యవస్థలో ఎప్పుడు విజయవంతంగా అమలైనా అక్కడగ్ర వర్ణాల ఆధిపత్యమే అంతర్భాగంగా రాజ్యమేలుతుంటుంది. క్రైస్తవుల చర్చీల, ఇస్లామ్ మసీదుల విషయంలో ఎన్నడూ కలుగజేసుకోని మన లౌకికరాజ్యం హిందూల దోపిడీ వ్యవస్థకి కాపలాలా "దేవాదాయ ధర్మాదాయ శాఖ" నే ప్రత్యేక దుకాణాన్ని పెట్టిందంటే అందులోని మర్మమేమిటో గ్రహించాలి. మసీదుల్ని కూల్చేసినా, క్రైస్తవ ఫాదర్ల్ని కాల్చేసినా, గుజరాత్ మొదలుకుని ముజఫర్‌నగర్‌దాకా విద్వేషంతో విర్రవీగుతూ అమాయకులపై అఘాయిత్యాలెన్ని చేసినా, మహరాష్ట్రలోని హేతువాద ఉద్యమకారుడైన నరేంద్ర దభోల్కర్‌ని ఘోరంగా పట్టపగలు నడిరోడ్డుమీద హత్యచేసినా దొరకని హంతకుల సంగతేమోగానీ హిందువుల మనోభావాల్ని ఏమాత్రం దెబ్బతీసినా, బాల్‌థాకరే, మోడీలపై ఫేస్‌బుక్‌లో కామెంట్లు చేసినా నేరమారోపించి చర్య తీసుకోడంలో వెనుకడుగేయరు.

గణేష్ నవరాత్రులనీ, దసరా ఉత్సవాలనీ, హనుమాన్ జయంతులనీ, హోళీ పండుగనీ రోడ్డుకడ్డంగా స్థలాల్ని కబ్జాచేసి దందాలు జరుపుకునే బృందాలకి ఎన్ని పుష్కరాల్లో మునిగితే చేసిన పాపాలు పోతాయో స్పష్టతుంటే మంచిది. హిందూమతోన్మాద భావజాలాన్ని విస్తరింపజేసుకునే కుట్రలో భాగమే పుష్కరాలనీ దళిత బహుజన అభ్యుదయశక్తులు గుర్తించి వీట్ని పూర్తిగా బహిష్కరిస్తూనే కులమత నిర్మూలనోద్యమ ప్రాతిపదికతో కూడిన ప్రజాతంత్ర భావోద్యమాల్ని అభివృద్ధి చేసుకోవాలి. కేవలం మన అనాగరికతని తెలిపేందుకు మాత్రమే పనికొచ్చే ఇలాంటి అప్రజాస్వామిక అహేతుక అశాస్త్రీయ తతంగాలకి సంబంధించిన స్పృహను ప్రజలు కల్పించుకుని వీటిని వ్యతిరేకించాలని విజ్ఞప్తి చేస్తున్నా.

- బహిష్కృత స్వరపీఠం

# ప్రత్యామ్నాయ సంస్కృతి నిర్మాణం

**"జిజ్ఞాసువుగా** ఉండటంలోనే జీవితానికి అర్థం - సార్థకం ఉన్నాయంటాడు" జాక్‌లండన్ 'ఉక్కుపాదం' అనే గొప్ప నవలలో. అయితే ఈనాటి విద్యావిధానం ప్రశ్నించడాన్ని నేరంగా పరిగణిస్తోంది. బానిస సంస్కృతిలో భాగమయిన అవలక్షణాలన్నింటినీ ఆధునికత పేరుతో బాల్యం నుంచే పిల్లలకి అంటకడుతూ స్వతంత్రాలోచనా వైఖరిని కాలరాస్తోంది. ప్రజల మనస్తత్వాలపై ఇప్పటికే పెత్తనం చెలాయిస్తోన్న మతాలకి తోడుగా మన ప్రభుత్వాలు, సరళీకరణ ఆర్థిక విధానాలంటూ, నూతన, బానిసత్వ పాఠాల్ని రుద్దడానికి సిద్ధపడుతున్నాయి. జనాల జవసత్వాల్ని జల్లెడపట్టి, ప్రజల మనసుల్ని పీల్చిపిప్పిచేసే ఈ ప్రక్రియ దశాబ్దాల క్రితమే ప్రపంచబ్యాంక్ ప్రాతినిధ్యంతో ప్రారంభమయింది. సామాన్యులు జీవించడానికి కావలసిన కనీస వసతి సౌకర్యాల్ని, నిత్యావసర వస్తువుల్ని అందుబాటులోకి తేవడం ఎలాగూ సాధ్యం కాదని తెలిసిన పాలకులు, అసాధారణంగా తమని తాము ప్రదర్శించుకుంటూ బుగ్గిపాలయిపోవడమే సగటు వ్యక్తి కర్తవ్యంగా నమ్మిస్తున్నారు.

అందులో భాగంగానే పాతసీసాల్లో కొత్త కంపు నీరు పోసి ప్రచారం చేస్తున్నారు. పురాతన మతాలకి సరికొత్త రంగులద్ది నూతన ముసుగులతో జనాల మెదళ్ళలోకి ప్రవేశపెట్టే కార్యక్రమం నిరంతరాయంగా అమలవుతోంది. ముఖ్యంగా, విద్యార్థులు, యువత 'ప్రశ్నించకుండా' వారికి జీవితాంత దాస్యాన్ని ప్రసాదించే విషయమై మతాలన్నీ ఎప్పుడూ ఏకాభిప్రాయంతోనే ఉంటాయి. "ఈ లోకంలోని సామాజిక సమస్యల్ని పట్టించుకోకుండా పరలోకం గురించి ఆలోచించడం, అందుకు సమయాన్ని కేటాయించడం బుద్ధిలేనితనం" అంటాడు బుద్ధుడు. ఆత్మ పరమాత్మల పేరుతో, కర్మలంటూ - జన్మలంటూ కట్టుకథలల్లే దొంగలందరూ మనిషి మేధో శ్రమవలన కానీ శారీరకశ్రమ వలన కానీ, ఉత్పత్తి చేసిన ఏ వస్తువునీ ఉపయోగించకుండా ఎంతకాలం జీవించగలరో గమనిస్తే దేవుడనే ఆలోచన ఎంత కుట్రపూరితమైందో సులభంగానే అర్థమవుతుంది.

ఆలోచించడమనేది ఒక గొప్ప లక్షణం. అంతిమంగా ఇది ఆచరణకి దారితీస్తుంది. స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు మౌలికంగా మనిషనే వాడికి ఉండవలసిన ఉన్నత గుణాలు. "The power to think and the desire to rebel" అని బకూనిన్ అన్నట్లు, స్వేచ్ఛగా ఆలోచించడం, స్వతంత్రంగా ప్రవర్తించడం మానవుడి ఔన్నత్యానికి ప్రతీక. ఈరోజు ప్రత్యామ్నాయ సంస్కృతిని మనస్ఫూర్తిగా ఆశిస్తూ, అందుకోసం నిజాయితీగా పాటుపడడానికి సిద్ధపడే వ్యక్తులంతా, తాత్విక పునరుజ్జీవనోద్యమ దిశగా ప్రయత్నించాల్సిన అవసరం ఉంది. అందుకే నాస్తిక తత్వవేత్త రామకృష్ణగారు, "ఈ దేశంలో పుట్టిప్రత్నామాయ వ్యవస్థకు పునాదిగా వేల సంవత్సరాల నుంచి కొన వూపిరితో బ్రతుకుతున్న లోకాయతానికి లేదా పదార్ధవాదానికి ఆధునిక రూపం తీర్చిదిద్దవలసిన అవసరం వుంది. లేకపోతే, ఎంత తీవ్రంగా వున్న ఉద్యమాలు నడిపినా అవేవీ నేటి పీడక పాలకవర్గాలకు ప్రత్యామ్నాయం కాజాలవనీ, ఎక్కువ రోజులు నిలవవనీ రూఢీగా చెప్పవచ్చు." అంటారు తన 'చార్వాకం' గ్రంథంలో.

పునరుత్పత్తి కావించుకోలేని జాతి అంతమయిపోతుందనేది ఆధునిక శాస్త్రవిజ్ఞానం మనకందించిన పాఠ్యాంశాల ప్రధమ సూత్రం. దాదాపు అయిదువేల సంవత్సరాల క్రితం ఒంటరిగా మతాల్ని ఎదిరించి, సామాజిక అసమానతలకి కారణాల్ని అన్వేషించిన చార్వాకలోకాయతాలే మనకి స్ఫూర్తి. ఆనాటి నుంచి ప్రపంచంలోనూ, మనదేశంలోనూ సత్యాన్వేషణకి అంకితమయిన కొద్దిమంది చేసిన – చేస్తున్న కొద్దిపాటి ప్రయత్నాల కారణంగా కొద్దోగొప్పో భౌతికవాదం అభివృద్ధి అయింది. అయితే, అది ప్రత్నామాయ సంస్కృతిని నిర్మించుకునేంతలా కాదనేది స్పష్టం. అందుకే, ఇందుకోసం, ముఖ్యంగా శాస్త్రవిజ్ఞాన ప్రాతిపదికగా నడుస్తున్న సమతా ఉద్యమ సంఘాలన్నీ నాస్తికత్వ ప్రచార ఐక్య సంఘటనగా రూపొంది ముందుకు సాగవలసిన అవసరం వుంది. ఆచరణలో ఇది అనుకున్నంత సులువు కాకపోగా కాస్త ప్రమాదభరితం కూడా. పాలక పెత్తందారుల భావవాదం అంత త్వరగా లొంగిపోయి తన ఓటమి నంగీకరించదు. పైగా తనకు చేతనైన అన్ని రూపాల్లో, మార్గాల్లో మనపై దాడి చేస్తుంది. అందుకే "క్రూరంగా ఉండడం ద్వారానే పిరికితనం శక్తివంతంగా ఉండగలదంటాడు" కార్ల్‌మార్క్స్.

చరిత్రలో అభ్యుదయ వ్యవస్థల పతనానికి అర్థం ప్రజాపీడన ప్రభుత్వాల శాశ్వత విజయం కాదు. అందుకే 1992 నాటి టైమ్స్ అంతర్జాతీయ పత్రిక "The collapse of communism does not guarantee the permanent triumph of capitalism and democracy" అని వ్యాఖ్యానించింది. అయితే, భౌతికవాద ప్రచారోద్యమం చెప్పుకోదగ్గ విధంగా జరిగినప్పుడే ఏ రకమయిన మార్పయినా సాధ్యం. అప్రయత్నంగానే అలౌకికమయిన ఆలోచనలకీ లౌకికమయిన స్తబ్దతకి అలవాటు పడుతున్న వర్తమాన సమాజంలోని నిర్లిప్తత నిండిన యువతరం హృదయాల్లో సమూల పరివర్తన తీసుకురావడానికి గాను ప్రత్యామ్నాయ సాంస్కృతికోద్యమాన్ని సంతృప్తికర స్థాయిలో కొనసాగించాలి. "Men are mortal, so are ideas. An idea needs propagation as much as a plant needs watering. Otherwise both will wither and die" అంటాడు అంబేద్కర్ ఒక సందర్భంలో. సామ్రాజ్యవాద రోత సంస్కృతికి భిన్నంగా పీడిత తాడిత బహుజన సంస్కృతిని అభివృద్ధి చేసుకోవడం దానిని ఆచరణాత్మకంగా అవలంభిస్తూ అన్ని మార్గాల్లో ప్రచారోద్యమం నిర్వహించడం ప్రస్తుతం మనకున్న ఏకైక ప్రత్యామ్నాయం.



## ఎన్నికల ప్రహసనం - ప్రజా ఉద్యమాల ప్రణాళిక

"**ఎన్నికలైపోయిన** తర్వాత దేశం ఎలాగుంటుంది? దగాపడిన ఆడకూతురి లాగుంటుంది! దొంగ నవ్వుల బ్రోకర్ని నమ్మేసి అమాయకంగా రైలెక్కిపోయిన పల్లెటూరి పిచ్చిపిల్లలా వుంటుంది దేశం... అయిదేళ్ళ సుదీర్ఘనిద్రకు కొంగుపరుచుకుంటున్న పిల్లల తల్లిలాగుంటుంది. ఎన్నికలపోయినాక దేశంలో ఒక విషాదాంతమైన ప్రహసనం ముగిస్కిపోయినట్టుంటుంది. ఎన్నికలైపోయాక దేశం పరాయివాడి పాలనలోకి వెళ్ళిపోయినట్టు అనిపిస్తుంది. ఎన్నికలైపోయినాక మనల్ని ఎవరో వెక్కిరిస్తున్నట్టు అనిపిస్తుంది. ఎవరో మనల్ని చూసి నవ్వినట్టుంటుంది... పంచుకోలేక మనం తగువులాడుకుంటున్న రొట్టెను కోతి తినేసినట్టు తెలుస్తుంది..... మన ఇంట పుట్టిన దోమైనా, పరాయింట పుట్టిన జలగైనా మన రక్తం పీల్చే బతుకుతాయని తెలుస్తుంది. తెలిసి తెలిసీ అయిదేళ్ళకోసారి జీవితాంతం మోసపోవటం గురించి ఏడుపొస్తుంది. మనమీద మనకి అసహ్యం వేస్తుంది, రోత పుడుతుంది... మన ఓటే మనల్ని కాటేసిందని తెలుస్తుంది. ఈ మొహం మరో అయిదేళ్ళ వరకూ ఎవరికీ చూపించలేం గదా అనిపిస్తుంది. దిగులేస్తుంది".

**- కె.ఎన్.వై. పతంజలి**



సమాజంలో ఎన్నో రకాల అవకాశవాదం, తెలివితక్కువతనం, సంకుచితత్వం, పిరికితనం ఉంటేనే ఫాసిజం బలపడగలుగుతుందనేది నాజీవాదం నేర్పిన సత్యం. ఆ సత్యాన్ని భారతదేశం మరొకసారి రుజువు చేస్తున్నది"

**- కె. బాలగోపాల్**



వర్తమాన రాజకీయాల్లో మతతత్వ శక్తుల ప్రభావాన్ని ఇప్పటిదాకా బహిరంగంగా అంగీకరించడానికి ముందుకురాని ప్రజాస్వామ్య లౌకికశక్తులన్నీ

కనీసం ఇకనైనా కలసికట్టుగా సిగ్గుపడాల్సిన సమయమొచ్చిందని గుర్తించడం వాటి నైతిక నిజాయితీకి ప్రమాణమౌతుంది. ఇప్పటిదాకా విద్వేషభరిత భావజాలంగానే ప్రచారమైన 'హిందుత్వం' దేశచరిత్రలో మొట్టమొదటిసారి అత్యధికశాతం మంది ప్రజల్ని 'అభివృద్ధి' ముసుగులో లోబరుచుకుని 'ఆదర్శం' స్థాయికి ఎగబాకేందుకు ప్రయత్నిస్తోంది. గుజరాత్‌లోని ప్రజల నిజజీవిత వ్యధల్ని పట్టించుకోని ప్రసారమాధ్యమాలన్నీ భ్రమాజనిత కథల్ని విస్తృతంగా వ్యాపింపజేయడంలో వాటి పాత్రను ఎప్పట్లాగే కార్పోరేట్ ఆదేశాలకనుగుణంగా నిర్వహించడంలో పెద్దగా ఆశ్చర్యపోవాల్సిందేమీలేదు కాని లౌకిక ప్రజాతంత్ర శక్తులన్నీ చాలా అన్యాయకరంగా – అవమానకరంగా వ్యవహరించడం మాత్రం మన ప్రజాస్వామ్యానికి ప్రమాద సూచిక.

ఇది వ్యక్తులకో లేక పార్టీలకో సంబంధించిన విషయం కాదు. ఈ దేశాన్ని శతాబ్దాలుగా ఏ శక్తులైతే భయంకరంగా పట్టిపీడించాయో, ఏ శక్తులైతే వర్ణ – వర్గ – జాతి – లింగ బేధాలతో అమానుషంగా చరిత్రలో రక్తపుటేరులు పారించాయో, ఏ శక్తులైతే సమాజంలోని అధిక ప్రజానీకానికి అవకాశాల్ని నిషేధించి 'ప్రతిభ' తమ గుత్త సొత్తనుకున్నాయో... ఆ అవాంఛనీయ శక్తులు ప్రజ్వరిల్లేందుకు దారి కల్పించిన సామూహిక అనాలోచితత్వం మనది.సమిష్టి అవివేకానికివాల్టి సమాజమే ఒక నిరూపితమయిన సత్యం. ఇక ఈ 'అభివృద్ధి' బారి నుండి తప్పించుకోవడం అంత సులువుకాదు. ప్రాంతీయ ఆధిపత్యంతోనే లెక్కలేనన్ని సజీవ ప్రాణాల్ని తీయగలిగిన క్రూరమైన హృదయాలకు, యావత్ దేశంపై అధికారాన్నివ్వడం అంటే, ఈ దేశంలోని ప్రజాస్వామ్యాన్ని – మత సామరస్యాన్నీ ఎప్పట్నుంచో మట్టుపెట్టాలని చూస్తున్న దుండగులకి అవి చేసేందుకవసరమైన యాజమాన్యపు హక్కును మనమే కల్పించడం. దేశభక్తి పేరిట జరిగేదాడుల్నీ, అత్యాచారాల్నీ, హత్యల్నీ, అణిచివేతల్ని సిగ్గులేకుండా మర్చిపోయి అందుకు కారకులయిన హంతకముఠాలకి మన సోదరుల్ని చంపడానిక్కావల్సిన, మన అక్కల్ని – చెల్లెళ్ళనీ చెరచడానికి కావాల్సిన ఆయుధాల్ని, అంతరాత్మల్ని తాకట్టు పెట్టుకుంటే వచ్చిన సొమ్ముతో కొని అందించడంతో సమానం.

ఈ నిజాలన్నింటినీ ఇప్పుడే తెల్సుకున్నట్టు మొహంపెట్టి, తెలీక పాపం చేశామన్నట్టు దొంగఫోజు కొట్టడం వల్ల ఇప్పుడు ఉపయోగం లేదు. ఈ ఎన్నికల

తీర్పు భావవికాసోద్యమాలన్నిటి మీదా చాలా పెద్ద బాధ్యతను పెట్టింది. మన కార్యాచరణను పునఃసమీక్షించుకుని, ఉద్యమ నిర్మాణానికి పునరంకితం కావాల్సిన అవసరాన్ని మనం గుర్తించాల్సిన సందర్భమొచ్చింది. "హేతుబద్ధమైన జ్ఞానంమీద ఆధారపడిన ఆచరణే ఫలితాన్ని ఇస్తుందని, అది ఎంత హేతుబద్ధమయితే అంత మంచి ఫలితాన్ని ఇస్తుందని నమ్మడమే మనకు తెలుసు. 'శాస్త్రీయత' మీదున్న ఈ విశ్వాసం విషయంలో మార్క్సిస్టులకూ బూర్జువా హేతువాదులకూ తేడాలేదు. అది అన్ని వేళలా నిజం కానక్కరలేదని రుజువు చేసే సంఘటనలు మళ్ళీ మళ్ళీ జరుగుతూనే ఉంటాయి. అయినప్పటికీ ఈ విశ్వాసం చెక్కుచెదరకపోవడానికి కారణం విశ్వాసాలకుండే బలమే తప్ప ఈ విశ్వాసంలోని సత్యం కాదం"టాడు బాలగోపాల్ ఒక సందర్భంలో.

మన దేశంలో ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో మతతత్వానికి బలంలేదని ఇంతకాలం చంకలు గుద్దుకున్న వారంతా నిబద్ధతగా ప్రస్తుత పరిస్థితిని గూర్చి పునరాలోచించాలి. ఒక రకంగా చూస్తే రాష్ట్రంలో ప్రాంతీయ పార్టీల హవా కొనసాగినట్లు కనబడినా దాని వెనకున్న అప్రజాస్వామ్య ఆలోచనల్ని తక్కువంచనా వేయలేం. ఎందుకంటే, మొత్తంగా చూసినప్పుడు ప్రజలు ఇతర ఏ ప్రత్యామ్నాయాల్ని ఎందుకు ఎంచుకోలేదనే ప్రశ్న వస్తుంది. తమిళనాడు, కేరళ తర్వాత మన రాష్ట్రంలోనే సాంఘికోద్యమాలు పురుడు పోసుకున్నాయి. రాష్ట్ర విభజన వల్ల తెలంగాణాలో సానుభూతి, వుద్యమగాలి వీచిందని సంబరపడినా గణాంకాల దగ్గరకొచ్చేసరికి బేజారవకమానం. ఒకానొక సందర్భంలో మార్క్సిస్టు తత్వవేత్తయిన లెనిన్ వాడిన "ఒకడగు ముందుకు రెండడుగులు వెనక్కి" అనే నానుడి ఈ వాతావరణంతో సరిపోల్చడానికి సరిగ్గా సరిపోతుందేమో.

ఐతే, అన్ని ప్రజాపక్ష శక్తులూ ఈ పరిస్థితిని ధైర్యంగా ఎదురుకోడానికి ఎప్పుడైతే వెనకాడుతాయో, అప్పుడిక అప్రయత్నంగానే మనం బలహీనమవడమే కాకుండా చురుకైన కార్యకర్తల్ని కూడా నిరాశానిస్పృహలకు గురిచేసినవాళ్ళమౌతాం. అలా కాకుండా, ప్రగతికర వాదులంతా అనివార్యంగా దీన్ని అధిగమించగలిగేందుకు కృషి చేయటమవసరం. సమాజంలోని అన్ని వర్గాల వద్దకు చైతన్య భావజాలాన్ని తీసుకెళ్ళటం మన బాధ్యత. ప్రస్తుతమున్న సంక్లిష్ట వాతావరణం మన బాధ్యతను

పెంచుతుందేకాని తగ్గించదు. ఒక ప్రమాదకరమైన భావజాలాన్ని సాధారణంగా వ్యతిరేకించడం వేరు. సమగ్రమైన భావజాల సాయంతో వ్యతిరేకించడం వేరు. వ్యవస్థీకృత మతాన్ని నాస్తిక - హేతువాద - స్వేచ్ఛాలోచనాపరులుగా మనమెందుకు వ్యతిరేకిస్తున్నామనే వాదనను శాస్త్రీయ శైలిలో ప్రతిపాదించడం పైనే భవిష్యత్ భావవిప్లవోద్యమాల భవితవ్యం ఇమిడివుందనేది నా భావన.

మనం వ్యక్తం చేస్తున్న భావాలే మనమేవర్గాలకి ప్రాతినిధ్యం వహిస్తున్నామన్న దానికి సూత్రంగా వుంటాయి. బీద, మధ్యతరగతి జనాల్ని, ముఖ్యంగా యువతనీ ఆకర్షించడంలో తాత్కాలికంగా తిరోగమనవాదులు విజయం సాధించొచ్చు కానీ అంతిమంగా భావాలకు నిజాయితీలేనిచోట భాష ఎక్కువకాలం నటిస్తూ బతకలేదు. కాబట్టి, ఎప్పటికైనా తుడిచిపెట్టుకుపోవాల్సిన సంకుచిత సిద్ధాంతాల గురించి ఇంతకంటే విలువైన సమయం వెచ్చించి చర్చించుకునే బదులు సామాన్య ప్రజానీకంతోబాటు విద్యావంతుల్లో, మేధావుల్లో చాపకింద నీరులా పెరుగుతున్న ఈ విద్వేష భావజాలాన్ని సమర్ధవంతంగా ఎదుర్కొని ప్రజాస్వామ్యానికి బాసటగా నిలిచే అభ్యుదయాచరణని ఏ విధంగా అవలంభించాలనే అంశంపై దృష్టి పెట్టడం మంచిది. అదే సమకాలీన రాజకీయ సంఘటనలకి స్పందించే ప్రతీ ప్రజా ఉద్యమంలోనూ ఉండాల్సిన ప్రధాన ప్రణాళిక.

**- ఎన్నికల ఫలితాలపై స్పందనగా...**



# వివక్ష విద్యా ప్రదాతలు

**ప్రాథమికంగా** ప్రపంచంలోని ఏ విద్యావిధానమైనా పిల్లల్ని వివేకంతో కూడిన విజ్ఞానవంతులుగా తయారుచేయడానికి రూపొందితే, ఈ దేశంలో మాత్రం చిన్నప్పట్నుంచే వివక్షతో కూడిన అవివేకులుగా మలచడానికి పథకాలు రచించబడ్డాయి.. అందులో భాగంగానే వందల సంవత్సరాల్నుంచి 'అంటరాని వాళ్ళు'గా చూడబడుతున్న వార్ని 'రిజర్వేషన్‌గాళ్ళు'గా పిలుస్తూ దూరం పెడుతున్నారు.. ప్రపంచీకరణ ప్రభావంతో చదువనేది సరుకుగా మారిపోయిన తర్వాత, విద్యని ఆర్జించడానికి బదులు ఆర్జించినవారికే విద్య అనే కొత్త సంప్రదాయం మొదలైంది. ఆరంభంలో అగ్రవర్ణ గుత్తసొత్తుగా నున్న 'విద్య' ఈ రోజు ఖరీదైన మార్కెట్ వస్తువైపోయింది. ఇక అన్ని వర్గాల వారికీ చదువందుబాటులోకి వచ్చేసిందనే పీతల కోతల్ని పక్కన పెడితే అసలు ఈనాటి 'విద్య'కి అందుబాటులోకొచ్చినవి ఏ వర్గాలో చూడాలి.

జీవితం నుంచి విడివడి నేర్చుకునే విద్యనేదీ ఉండదు. అలాగే విద్యని జీవితంలో కేవలమొక భాగంగా భావించడం కూడా సరికాదు. అందుకే "All genuine learning comes through experience," అన్న John Dewey, "Education isn't a preparation for life; education is life itself" అంటాడు. ఈనాటి విద్యావిధానంలోకానీ, అధ్యాపకుల్లో కానీ ఈ దృక్పథం బొత్తిగా కనబడదు. పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాలు, ఉపాధ్యాయులకి ఉద్యోగాలు కల్పించే సాధనాలుగా, కోట్లాదిమందికి కాలక్షేపానికి పనికొచ్చే తిరునాళ్ళుగా ఉపయోగ పడుతున్నాయేకానీ వ్యక్తుల ఔన్నత్యాన్ని పెంపొందించే ప్రామాణిక ప్రదేశాలుగా కాదు. ఈ దేశంలో సాంఘిక క్రూరత్వానికి విద్యావిధానం కూడా మినహాయింపు కాదు. అందుకే పుట్టుకతోనే కొన్ని కులాలకి ప్రతిభ గుత్తసొత్తనే కుట్రపూరిత వాదన ఈనాటికీ ప్రచారమౌతోంది. పీడిత, అణగారిన దళిత బహుజన గిరిజనులందర్తో పాటు స్త్రీలు, హిజ్రాలపట్ల ఈ వివక్ష బహిరంగంగానే అమలవుతోంది.

మొదట్లో బ్రాహ్మణులకి మాత్రమే పరిమితమయిన జ్ఞానార్జన ఈరోజు బ్రాహ్మణీయ పాలకులకి వత్తాసు పల్కుతోంది.

"కులముగలుగువారు గోత్రంబుగలవారు
విద్యచేత విర్రవీగువారు
పసిడిగల్గువాని బానిస కొడుకులు
విశ్వదాభిరామ వినురవేమ"

అని ఆనాడు వేమన చెప్పిన పద్యం ఈనాటికీ అక్షర సత్యమే. సనాతన ఫాసిస్టు మతం వల్ల వందల సంవత్సరాలు నిరక్షరాస్యులుగా బతికిన ప్రజలకి భక్తి ఉద్యమాలతో, ఇస్లాం, క్రైస్తవ మతాల రాకతో మధ్యయుగాలనాటికి కాస్త సాంఘికోద్యమ చైతన్యం వచ్చింది. ఇక ఆంగ్లేయుల పుణ్యాన ఆధునిక విద్యకి సంబంధించిన అంశాలు చర్చకొచ్చాయి. మహాత్మ జ్యోతిరావు ఫూలే అణగారిన వర్గాల వారి పిల్లల కొరకు ఉచిత పాఠశాలల్ని తెరిచాడు. మన రాష్ట్రంలో భాగ్యరెడ్డివర్మ ఈ ఉద్యమాన్ని చేపట్టి దళితుల కోసం ప్రత్యేక స్కూళ్ళను ఏర్పాటు చేసాడు. ఆ తర్వాత గాంధీ 'నయాతాలిమ్' పేర్తో ఏడు సంవత్సరాల ప్రాథమిక విద్యని ప్రతిపాదించాడు. ఐతే పిల్లలందరికీ ఉచిత విద్యనే విప్లవాత్మకమైన ఆలోచన అంబేద్కర్‌దే.

విద్యారంగంలో వివిధ సంస్కరణలు మొదలుకుని ఎన్నిరకాల పథకాలు ప్రవేశపెడుతున్నా విద్యావిధానం ఆశించినంతగా పురోగమించట్లేదని వాపోయేవారి కర్థం కావాల్సింది, సామాజిక రంగం నుంచి విడివడి ప్రత్యేకంగా విద్యాభివృద్ధి కొరకు జరిగే ప్రయత్నాల ఫలితం అలాగే వుంటుందని. ప్రపంచీకరణ ప్రభావంతో సరళీకృత ఆర్థిక విధానాల వల్ల రూపొందుతున్న విద్యా ప్రణాళికలు 'సమానవిద్య'ని మరింత సంక్లిష్టం చేస్తున్నాయి. రోజురోజుకీ సమాజంలో పెరుగుతున్న అసమానతల ప్రభావం విద్యావ్యవస్థలో సైతం కనబడుతోంది. విద్యనేది వివేకానికి బదులు విలాసానికి ప్రతీకగా చూడబడుతోంది. మొత్తంగా చదువు'కొన'డమొక ఆడంబరంగా తయారయింది.

ఈ కుట్రపూరిత మోసం పాలకులు ప్రవేశపెడితే దాన్నమలు చేస్తోంది మాత్రం అధ్యాపకులే. "నేర్చుకోడం మానేసిన వాళ్ళు బోధించడం ఆరంభించడం ఈ శతాబ్దపు

దౌర్భాగ్యమన్నా"డో వేత్త. వారిని వారు ఏనాడూ ప్రశ్నించుకోని, పరిశీలించుకోని ఉపాధ్యాయులు తరగతిలోని పిల్లలకి ఏ విషయాన్నైనా ప్రశ్నించటం, పరిశీలించడ మెలా నేర్పిస్తారో అర్థం కాదు. అందులోనూ ఈ దేశపు విషవర్ణవ్యవస్థలోంచి వచ్చిన 'అయ్యోర్లు' అప్రయత్నంగానే 'అంటు'కి అలవాటుపడుండటం మూలాన దళిత బహుజన, స్త్రీ విద్యార్థుల పట్ల వాళ్ళ వికారం ఆచారంగానే అమలవుతుంటుంది. పొట్టకోస్తే అక్షరంముక్కరాని అగ్రకుల వ్యక్తి సమాజంచేత గౌరవించబడుతోంటే, విశ్వవిద్యాలయ పట్టా పుచ్చుకున్న దళిత బహుజనులు కేవలం 'కులం' కారణంగా నీచంగా చూడబడే అంటరాని సంప్రదాయం ఇక్కడింకా నడుస్తూనే వుంది.

"ఈ దేశంలో ప్రతి రాజకీయ పార్టీ నాయకుడు విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం పూర్తిచేసినవాడే కావడం ఈ దేశపు రాజకీయ రంగపు దౌర్భాగ్యమం"టారు లోహియా. 'ఆధునిక అగ్రహారాలు'గా బాలగోపాల్ అభివర్ణించిన ఈ విద్యాలయాలు విద్యార్థుల్లో, అన్ని దేశాల మనుషులంతా ఒక్కటేనననే నిజాన్ని పక్కనపెట్టి ఈ దేశంలో పుట్టుకతోనే మనుషులంతా వేర్వేరనే దాన్ని చొప్పిస్తాయి. ప్రతీ వ్యక్తికి ఏదో 'కులం' వుంటుందని చెబుతాయి. ఉచ్చనీచాలనేవి కులం కారణంగా సంక్రమిస్తాయనే అసంగతాల్ని అందంగా బోధిస్తాయి. ఇంకా ముందుకెళ్ళి మూఢనమ్మకాల్లో సైన్సుని వెతుక్కుంటాయి. పాఠ్యపుస్తకాల్లో రామాయణాన్ని ప్రవేశపెట్టి, శూద్రులు చదువుకోవడం లోకానికి మంచిది కాదనీ, అలాంటివార్ని చంపినా తప్పులేదనీ, స్త్రీల శీలాన్నిశంకించడం పురుషుల హక్కనీ, అందుకోసం వారితో అగ్నిప్రవేశాలు చేయించడం మంచిదేననే అమానుష సందేశాలనిస్తాయి. అశాస్త్రమైనవాట్ని ఆధునిక పరిభాషలోకి తర్జుమాచేసి వాటికి లేని శాస్త్రీయతను అంటకట్టడం ఈ దేశపు జాడ్యం.

యూనివర్శిటీల్లో జ్యోతిష్యాన్ని ప్రవేశపెట్టినా, పూజల్లో, పూనకాల్లో సైన్సుని వెతికినా, వినాయక విగ్రహాలు పాలుతాగడంపై, సాయిబాబా ఫోటోల నుంచి విభూది రాలడంపై పరిశోధన చేసినా అవన్నీ ఇంతకాలంగా కొనసాగుతున్న అగ్రకులాల పాలనాధిపత్యాన్ని కాపాడేందుకు వేసే నాటకాలే తప్ప వేరుకావు. "Revolutions can, and often have, begun with reading" అంటారరుంధతీరాయ్. అధ్యయనం లేని విద్య కేవలం అర్హత సంపాదించుకోవడంతోనే ఆగిపోతుంది. ఈనాట

ఉపాధ్యాయ ఉద్యోగాలన్నీ వారికలా వచ్చినవే. అందుకే విద్యాబోధననేది ఉద్యోగంలో ఉండటం కోసం చదువుచెప్పే కాలక్షేప వ్యాపకంగా ఉంటోంది తప్పితే విద్యార్థుల్లోని శారీరక, మానసిక సృజనాత్మకతకి పదునుపెట్టి, వారిలోని నైపుణ్యాలను వెలికితీసే ప్రాపంచిక దృక్పథంగా చెప్పబడ్డం లేదు.

"School is an institution build on the ariom that learning is the result of teaching" అంటాడివాన్ యిల్లిచ్ "De-Schooling Society' అనే అద్వితీయ రచనలో. మెకరెంకో, గిజుబాయి, నీల్ మొదలుకుని వర్తమానంలో కూడా ఎంతోమంది ప్రత్యామ్నాయ విద్యావిధానాలపై కృషిచేస్తున్నవారున్నారు. వాట్ని పరిశీలించడంతోబాటు కొఠారి కమీషన్ (1964-66) సూచించిన కామన్‌స్కూల్ విద్యావిధానాన్ని అమలుచేయడం ద్వారా విద్యార్థుల్లో సామాజిక పరివర్తన ఆశించొచ్చు. ప్రపంచంలోని గొప్ప మార్పులన్నీ బోధకుల ద్వారానే సాధ్యమయ్యాయి. సోక్రటీస్, స్పార్టకస్‌లు మొదలుకుని బుద్ధుడు, కబీరు, క్రీస్తు, మహ్మద్... అందరూ వ్యవస్థీకృతమైన అసమానతల్ని వ్యతిరేకించినవారే. అంతటి మహోన్నతమైన బాధ్యతాయుత కార్యక్రమాన్ని నిర్మించే అవకాశమున్న అధ్యాపకులు సంకుచితమైన చట్రాల్లో కూరుకుపోకుండా తమవంతు కర్తవ్యంగా 'సమూల మార్పు'నాహ్వానించే యువతరాన్ని మలిచే నిర్మాతలవ్వాలని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ...

**ఉపాధ్యాయ దినోత్సవం సందర్భంగా...**



# చట్టాల దుర్వినియోగం - తులనాత్మక చర్చ

**ఈమధ్య** '498ఎ' దుర్వినియోగానికి సంబంధించిన చర్చ జరుగుతోంది. సమాజంలో ఆధిపత్య వర్గాల అస్తిత్వాన్ని ప్రశ్నించే చట్టాల్ని నిష్క్రియాపరం చేయడానికి ముఖ్యంగా రెండురకాల వాదనలు వినిపిస్తాయి. మొదటిది చట్టానికి చెందినదైతే రెండోది చట్టంలోని లోపాలకు చెందింది. చట్టాల్లోని క్రూరమైన శిక్షల్ని, మరణశిక్షని రద్దు చేయాలని ప్రపంచవ్యాప్తంగా హక్కుల సంఘాలవాళ్ళు ఆందోళన చేయడాన్ని అర్థం చేస్కోవచ్చు. కాని విచిత్రంగా నేరస్తులే నిర్ణేతల అవతారమెత్తి అభాగ్య స్త్రీలపై దాడులకి వ్యతిరేకంగా రూపుదిద్దుకున్న చారిత్రక చట్టం తమ హక్కుల్ని కాలరాస్తోందని గోల చేస్తున్నారు. ఇదెంతవరకూ నిజమో నిష్పక్షపాతంగా పరిశీలించడమవసరం.

ఏదైనా ఒక సాంఘిక దురాచారానికి విరుద్ధమైన చట్టాన్ని ఏర్పాటు చేస్కోవడం ఏ సమాజానికైనా కత్తిమీద సామే. ముఖ్యంగా స్త్రీని సొంత ఆస్తిగా భావిస్తూ, ఆమె విషయంలో అత్యుత్సాహం ప్రదర్శించే పురుష వ్యవస్థలో ఏ ఆలోచనైనా ముందు మగాళ్ళ కోణంలోంచే చూడటం జరుగుతుంది. నాణానికి రెండో వైపుంటుందనే స్పృహే లేకపోతే అలాంటి ఆలోచనలే వ్యవస్థీకృతమై ఆచారాలుగా స్థిరపడతాయి. సంఘంలో సగంమందున్న స్త్రీల పట్ల ఇలాంటి దురాచారాలు ఇంకా ఘోరంగా అమలౌతున్నాయనే సంగతిని గుర్తుంచుకుని మాత్రమే అవతలివైపు వాదన వినాలి.

శతాబ్దాలుగా కోట్లాదిమంది స్త్రీలని తోటి మనుషులనే కనీస జ్ఞానం లేకుండా బానిసలుగా వాడుకుంటూ, వారిపై అమానుష దాడులకు పాల్పడుతూ, మానసికంగా శారీరకంగా వార్ని కించపరుస్తూ, ప్రేమ పేరుతో, పెళ్ళి పేరుతో, సంసారం పేరుతో శవాలతో వాంఛలు తీర్చుకుంటూ లెక్కలేనన్ని హత్యలకు పాల్పడ్డ హంతకులకి హఠాత్తుగా ఒకట్రెండు సంఘటనల్తో ప్రజాస్వామ్యం గుర్తొచ్చింది. బలహీనమైన చట్టాల కారణంగా ఇంతకాలం హాయిగా తిరిగిన వాళ్ళు ఇప్పుడిప్పుడే పురోగమిస్తున్న స్త్రీ చైతన్యాన్ని తట్టుకోలేకపోతున్నారు.

దొమ్మిలకు, దొంగతనాలకు వ్యతిరేకంగానున్న చట్టాలుకానీ శిక్షలు కానీ దుర్వినియోగమౌతున్నాయని దొంగలెప్పుడూ ధర్నాలు, హర్తాళ్ళు చేయలేదు. ప్రజా ఉద్యమకారుల్ని అణిచివేయడానికి ప్రభుత్వం ఉపయోగించే అమానవీయ చట్టాల పట్ల కూడా చర్చ జరిగిందే కాని ఇంతస్థాయిలో ఆందోళన జరగలేదు. కానీ నిజంగా సమాజంలోని అణగారిన వర్గాల రక్షణ కోసం చేసిన ఎస్సీ, ఎస్టీ అట్రాసిటీ చట్టం గురించీ, 498ఎ చట్టం గురించీ ఎన్నడూ లేనంత చర్చ ఎందుకు జరుగుతోందనేది ప్రశ్నార్థకం. ఈ బాధిత వర్గాలకేనాడూ నోరులేదు. వారికి జరిగిన అన్యాయాన్ని చెప్పుకునే చేవ కూడా లేదు. మరి చర్చ చేస్తోందెవరు?

ఎవరంటే, ఎవరైతే ఇంతకాలంగా దళిత బహుజనుల్ని క్రూరంగా అణగదొక్కి వారిని అన్ని అవకాశాలకూ, నైపుణ్యాలకూ దూరం చేసారో, ఆ అగ్రకుల బ్రాహ్మణీయ ఆధిపత్య శక్తులే అట్రాసిటీ చట్టం గురించీ, రిజర్వేషన్ల గురించి, వాటి 'దుర్వినియోగానికి' సంబంధించీ చర్చ లేవదీస్తున్నారు. స్త్రీలు 498A ని దుర్వినియోగం చేస్తున్నారంటూ ప్రచారాలు చేస్తోంది కూడా ఈ మగమహారాజులే. ఇంతకాలం విస్తృతంగా ఉపయోగించుకున్న దళిత బహుజనుల, స్త్రీల సేవల్ని వదులుకోవడమూ, అట్టడుగుస్థాయి వ్యక్తులు స్వతంత్రంగా ఆలోచించి ఎదురు తిరిగి కేసులు పెట్టడం సహించలేకపోతున్నారీ పెద్దలు.

ఇన్ని చట్టాలుంటుండగానే సమాజంలోని స్త్రీపై ప్రతి రెండు నిమిషాలకీ ఒక అత్యాచారం జరుగుతోందని గణాంకాలు ప్రకటిస్తున్నప్పుడు, విశ్వవిద్యాలయాల్లోని విద్యార్థినులపై జరుగుతున్న నిర్భయ ఘటనలు మొదలుకుని ఇంట్లో, వీధిలో, ఆఫీసుల్లో, ప్రభుత్వ కార్యాలయాల్లో, హాస్పటల్లో, ప్రయాణాల్లో, పోలీస్ స్టేషన్లో, కోర్టుల్లో విచ్చలవిడిగా జరుగుతున్న దాడుల్ని, రేప్‌లనీ చూస్తూ, ఆడపిల్ల పుట్టిందంటే గర్భంలోనే హత్యచేసే తండ్రులు, ప్రేమిస్తే పరువు హత్యలు చేసేవాళ్ళూ, పెళ్ళయ్యాక అనుమానంతో చంపేసే భర్తలు, వీళ్ళందర్నీ చూస్తూ కూడా స్త్రీ రక్షణ కొరకు ఇంకా కఠినమైన చట్టాల్ని చేయాల్సిన అవసరాన్ని స్వచ్ఛందంగా మర్చిపోయి ఇప్పటికే ఏర్పరిచిన చట్టాలు దుర్వినియోగమయ్యాయని ఎవరైనా అనగలరా?

ప్రేమించినందుకు - ప్రేమించనందుకు, పెళ్లికొప్పుకున్నందుకు - వొప్పుకోనందుకు, నచ్చినట్లున్నందుకు వుండనందుకూ చివరికి నచ్చిన బట్టలేసుకున్నందుకు - వేసుకోనందుకు కూడా ఆడవాళ్ళని చంపేస్తున్నారు. ప్రసారమాధ్యమాల్లో 'మగతనమనే' పదాన్ని దమ్ముకి, ధైర్యానికి, ఆత్మవిశ్వాసానికి పర్యాయంగా వాడుతుంటే, 'ఆడతనమ'నే పదాన్ని నీచంగా, పిరికితనానికి సంకుచితత్వానికి సమానంగా ఉపయోగిస్తున్నారు. స్వతంత్రానికి ముందు నుంచి ఈనాటి దాకా స్త్రీల విషయంలో ఒక్క సతీసహగమనాన్ని నిషేధించడం మినహా మనం సాధించిందేమీ లేదు. అదైనా ఆంగ్లేయుల కారణంగా జరిగిందే.

వరకట్నానికి చట్టముంది. కానీ, ఇప్పటికీ ఆ సాంప్రదాయం అనాగరికంగా అమలౌతోంది. అక్రమ రవాణాకు చట్టముంది. ఐనా కోట్ల సంఖ్యలో స్త్రీలు ప్రతి ఏటా కసాయి గృహాలకు తరలించబడుతున్నారు. గృహహింసకు సంబంధించి చట్టం చేసినా ఎందరో గృహిణులు చిత్రహింసలకి గురౌతున్నారు. గర్భస్థ పిండ పరీక్ష చేయకుండా కూడా చట్టమున్నా వేల సంఖ్యలో స్త్రీలు యింకా పుట్టకుండానే గిడుతున్నారు. పుట్టినవార్లో సైతం ఎందరో రోడ్లపై వాహనాలకీ, చెత్త కుండీల్లో కుక్కలకి బలవుతున్నారు. ఆడవారి ప్రతి కదలికని అన్యాయంగా నిర్దేశించాలని చూసే ఈ మగాళ్ళ మగత రాజ్యంలో స్త్రీలని కాపాడే చట్టం దుర్వినియోగమౌతోందని మగాళ్ళు గోల చేయకపోతే మనుషులుగా మారిపోయారనుకోవాలే కానీ చేస్తే ఆశ్చర్యపడవలసిన పనేమీ లేదు. ఎందుకంటే, పశుత్వం వారి సహజగుణం.

మామూలు మగాళ్ళ విషయమిలా వుంటే, ఇక కొద్దోగొప్పో సాంఘిక చైతన్యం కలవారని సమాజం భ్రమపడే వారి సంగతి చెప్పనక్కర్లేదు. మందుకొట్టే మేధావులు మద్యపానాన్నీ అగ్రవర్ణ అహంకారులు కులాధిపత్యాన్నీ, మగమహారాజులు పురుషహంకారాన్నీ ఏదో విధంగా సమర్థించుకుందుకు చూస్తారు. మద్యపాన నిషేధం ఆచరణాత్మకంగా సాధ్యం కాదనీ, దశలవారీ నియంత్రణే ముఖ్యమనీ మందువే'తా'వులు, స్త్రీలింకా పూర్వంలా ఎక్కడున్నారనీ, రోజురోజుకీ బరితెగించిపోతున్నారనే మగమే'తా'వులు రెచ్చిపోయి చర్చలు చేస్తున్నారు.

నిజానికి మన సమాజంలో దుర్వినియోగమవుతోంది జ్ఞానమేకాని చట్టం కాదు. ఇంతకాలం లెక్కలేనన్ని దారుణ కిరాతక సంఘటనలపై స్పందించని మేధావులు, మీడియా బలహీనుల, పీడితుల పక్షం వహించకుండా అందుకు విరుద్ధమయిన పాత్ర పోషించడం అన్యాయం. అణగారిన దళిత బహుజన స్త్రీల్లో ఈనాటికీ చట్టాలకి సంబంధించిన పరిజ్ఞానం 10% కూడా లేదనేదో చేదు వాస్తవం. చట్టాలేర్పాటు చేసిన ఇన్ని సంవత్సరాల్లో ఎన్నడూ పీడితులకి, బాధితులకి చట్టాల్నెలా ఉపయోగించుకోవాలనే విషయాన్ని తెలియజేసే ప్రయత్నం చేయని పోలీసులు, న్యాయస్థానాలు, (అ)ప్రజాస్వామ్య సంఘాలు, ప్రసార మాధ్యమాలు చట్టాల దుర్వినియోగంపై ఇంత అత్యుత్సాహం చూపడం వాటి అంతర్గత పురుష లక్షణానికి తార్కాణం.

తిరోగామి మతతత్వ శక్తులే పాలకపాత్ర పోషిస్తున్న వ్యవస్థలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ వేగం పుంజుకుంటుంది. అనైతికతని ఆరాధించే సమాజమెప్పుడూ ఆడదాని శరీరాన్ని కోరికతో వాంఛిస్తూ వ్యాపార సరుకుగా వాడుకుంటుందే కానీ ఆమె హృదయానికి విలువిచ్చి సమానంగా గౌరవించలేదు. ఇలాంటి అప్రజాస్వామిక వ్యవస్థలో పురుషస్వామ్యం అమలౌతుందేకాని ప్రజాస్వామ్యం అమలు కాదు. దీన్ని గుర్తించి అభ్యుదయ ప్రగతిశీల స్త్రీ శక్తులన్నీ ఏకమై ఈ వాదాల్ని తిప్పికొట్టడం, మానవ సంబంధాల్లో మానవత్వాన్ని స్థాపించడానికి ప్రయత్నించడం చారిత్రక బాధ్యత.

**- చట్టాల దుర్వినియోగంపై చర్చకు స్పందనగా...**

# “స్వచ్ఛభారత్” ఎవరి కోసం?

***"Political language... is designed to make lies sound truthful and murder respectable, and to give an appearance of solidity to pure wind."***

– George Orwell

పై వాక్యం రాసినాయన రచించిన నవల్లోనే అధికార మదం తలకెక్కినొక నాయకజీవి, యుద్ధమంటే శాంతనీ, స్వేచ్ఛంటేనే బానిసత్వమనీ, అజ్ఞానమే బలమనీ (War is peace, Freedom is slavery, ignorance is strength) పిచ్చిపిచ్చి సందేశాలివ్వడమూ, గుంపు మనస్తత్వం అదే నమ్మడమూ జరిగినట్లు బాగా రాయటం జరిగింది. ప్రస్తుత మన వ్యవస్థను చూస్తుంటే, ఎందుకనో నాకా పుస్తకమే గుర్తొస్తోంది. మనిషి సంఘజీవి. నాగరికమానవుడి జీవితానికి పరిశుభ్రతనేదో సాధారణ ప్రమాణం. అన్ని అంశాల్లోలాగానే పరిశుభ్రతనే లక్షణం కూడా పరిణామక్రమంలో అనేక మార్పులకు లోనయ్యి, భిన్న ప్రాంతాల్లో విభిన్న రకాలుగా స్థిరపడింది. ఇక విషయానికొస్తే, మన ప్రధానమంత్రిగారికి పదవిలోకి రాగానే కోట్లాది ప్రజల జీవన్మరణ సమస్యలైన ఆహారం, ఆరోగ్యం, విద్యా, ఉపాధి, పేదరికం మొదలైనవి గుర్తుకురాకుండా ‘దేశ స్వచ్ఛత’పై మనసవడం యాదృచ్ఛికం కాదు. ఆయన మూలాలు తెల్సినవారికి ‘స్వచ్ఛభారత్’ నినాదం వెనకున్న భావజాలం సులువుగానే తెలుస్తుంది. మనం అశుద్ధులమనే సంగతి మనకి తెలీడానికి ఇన్ని సంవత్సరాల తర్వాత మోదీ అధికారంలోకి రావల్సొచ్చిందంటే ఆశ్చర్యం కలుగుతుంది.

వాస్తవిక దృష్టిలేని సాంఘిక వ్యవస్థేదయినా అవాస్తవికతను ఆరాధించడంలో ఆశ్చర్యపోవల్సిందేమీ లేదు గానీ అందుకోసం మూల్యమెవరు చెల్లిస్తున్నారనేదే ప్రశ్న. ప్రజలందరికీ కూడు, గుడ్డ, గూడు సమంగా సమకూర్చే విషయమై స్వతంత్రమొచ్చి ఇన్ని దశాబ్దాలైనా జవాబు చెప్పలేని పాలకులు, స్వచ్ఛత, శుభ్రత, పవిత్రత అంటూ

కొంతమందికి మాత్రమే వీలయ్యే అసమాన రుగ్మతల్ని జనానికెందుకు రుద్దాలనుకుంటున్నారో తెల్సుకోవడమవసరం. జనాభాలో అత్యధిక శాతం మందున్న కష్టజీవుల ఫలితాన్ని సిగ్గులేకుండా జుర్రుకుంటూ కూడా ఈ దేశంలోని శ్రామికవర్గాల్ని ఇంతకాలం తొక్కిపెట్టిన సనాతన భావజాలంలోని వో భాగమే 'స్వచ్ఛత'. అపరిమితమైన శుభ్రత బ్రాహ్మణత్వ జాడ్యం. మనుషులు పాటించే సాధారణ దైనందిన శుభ్రత దానికి చులకనగా కనిపిస్తుందందుకే. బౌద్ధం ప్రభావంతో చావుతప్పి కన్నులొట్టపోయిన హైందవం ఆకులు, అలములు తినటం అలవాటు చేస్కోడంతో బాటు మనుషుల 'స్వచ్ఛత'ను గురించి నిర్వచించడం ప్రారంభించి లాభపడింది.

నీచు తినడం నీచత్వమనీ, కష్టపడ్డం దాసత్వమనీ, దోచుకు దొబ్బి తినడమొకటే ద్విజత్వమనీ ప్రచారం చేసింది. పరిశుభ్రతను పాటిస్తూ అగ్రకులంలో జన్మించినవాళ్ళు స్పృశ్యులనీ, అస్పృశ్యులంటే శుభ్రత లేని దిగువకులాలవారనీ నిర్ణయించారు. ఎలాంటి వ్యవస్థలోనైనా తన ప్రత్యేకతను నిలుపుకోడానికి చూసే హైందవానికి, బ్రాహ్మణత్వమనేది బలం చేకూర్చే అసమాన పునాది లాంటిది. అందుకే ఎక్కడైనా అది తన స్వరూపాన్ని ప్రదర్శించుకోడానికీ, పెంపొందించుకోడానికీ ప్రయత్నిస్తూనే వుంటుంది. వర్తమాన సమాజం సైతం ఇందుకు మినహాయింపు కాదు కాన, కంప్యూటర్ల ముందు కూర్చొని శ్రామికుల రక్తం పీల్చేవారికీ, కారుల్లో తిరుగుతూ కార్మికుల కడుపు కొట్టేవారికీ తప్ప సంఘాన్ని నడిపించే కోట్లాది మంది కష్టజీవులకి ఈ రకమైన 'మడి' కట్టుకోవడం వల్ల ప్రయోజనం లేదు. లక్షలాది గ్రామాల్లోని దళిత బహుజనుల్ని అస్పృశ్యత పేర్తో ఈనాటికీ ఊరికి దూరంగా పెడుతూ, తమ మాట కాదంటేనో, నచ్చిన మతంలోకి మారితేనో చూసి తట్టుకోలేక క్రూరమైన దాడులకు పాల్పడే అగ్రవర్ణ దుండగ మనస్తత్వాల్లోని అమానవీయ మాలిన్యాన్ని శుభ్రం చేస్కుని మనుషులుగా మారకుండా దేశానికి స్వచ్ఛత గురించి సందేశాలివ్వడం ఎంత వివేకం?

సాంఘిక శుద్ధతకి వ్యక్తిగత శుభ్రత ఒక సాధనం. తనువునీ, మనసునీ పరిశుభ్రంగా వుంచుకోడం దీంట్లో భాగం. పిల్లలకు చిన్నప్పుడు తల్లిదండ్రులందరూ తప్పనిసరిగా బోధించే పాఠం పరిశుభ్రతే. శరీరాన్నీ, పరిసరాల్నీ శుభ్రంగా

వుంచుకోవడం ఈ దేశంలో వో మోస్తరు ప్రజలందరూ పాటించే సాంప్రదాయమే. ఉన్నంతలో ఇళ్ళనీ, వాకిళ్ళనీ అందంగా తీర్చిదిద్దుకోడం ప్రజలకి 'వెన్ను'తోపెట్టిన విద్య. మరి ప్రభుత్వం చెబుతున్న స్వచ్ఛత ఎవరికి? కార్పొరేట్ ఉత్పత్తుల్నీ, మద్యపాన దుకాణాల్ని విచ్చలవిడిగా గ్రామాల్లోకి తీసుకొచ్చి మత్తుతో, ప్లాస్టిక్‌తో గ్రామసీమల్ని వల్లకాడుగా మార్చిన పాలకులే ఈరోజు పరిశుభ్రత పేరుతో ప్రహసనాలు మొదలెట్టారు. ఎన్నడూ ఎవర్నీ ఏదీ అడక్కుండా వారి మానాన వాళ్ళుగా బతికే ఆదివాసీల్ని, గిరిజనుల్ని, మత్స్యకారుల్ని ప్రమాదకరమైన కాలుష్యాన్ని వెదజల్లే పెట్రోకెమికల్ కారిడార్‌ల కోసం దుర్మార్గంగా ఖాళీ చేయించే యత్నం చేస్తూ, రాజధాని పేరుతో పచ్చని పంటలు పండే లక్షలాది ఎకరాల పంటభూముల్ని రైతుల్నుంచి లాక్కుని నాశనం చేస్తోన్న నాయకులు, నిర్బంధ విద్యకి నీళ్ళొదిలేసి, ప్రభుత్వ వైద్యాన్ని పడకనపడేసి నాణ్యమయిన విద్య-వైద్యాల్ని టోకుగా ప్రైవేటు సంస్థలకు అమ్మేసుకున్న నాయకులు, వోవైపు నిత్యావసరాల ధరల్ని అదుపు చేయకుండా, స్త్రీలపై ఆగడాల్ని, అత్యాచారాల్ని ఆపేందుకు చిత్తశుద్ధితో ప్రయత్నించకుండా, నిరుద్యోగాన్ని అరికట్టేందుకు, రైతు ఆత్మహత్యలు నివారిం చేందుకు ఏం చర్యలు తీసుకున్నారో తెల్పకుండా, ఇవన్నీ ప్రశ్నించినవారి హక్కుల్ని కాలరాస్తున్న పాలకులు ఏ 'స్వచ్ఛత' గురించి సందేశాలిస్తున్నారో ప్రజలాలోచించాలి.

పిచ్చిపట్టిన శుభ్రత నాగరికతకి చిహ్నామైనచోట మామూలు పరిశుభ్రతనేది అనాగరికతకి ప్రమాణంగా చూడటం జరుగుతుంది. ఒళ్ళొంచదానికి సిగ్గుపడే బడాబాబుల్నుంచి, సిగ్గుపడుతూనే ఒళ్ళొంచే మధ్యతరగతి జనాలదాకా ఏదో రకంగా కష్టజీవుల్ని చులకనగా చూడటం అలవాటైపోయింది. ఎక్కువ మంది ప్రజలకి పనికొచ్చే కనీసవశరాల్ని కల్పించలేని ప్రభుత్వం పనికిరాని విలాసాల్ని ఆకర్షణీయంగా వారిపై రుద్దుతూ సంఘంలోని అసమానతల్ని వారెప్పటికీ గుర్తించకుండా మభ్యపెడుతోంది. ఈ రోజుకీదేశంలోని అన్ని మున్సిపాల్టీల్లోనూ, ప్రభుత్వ కార్యాలయాల్లోనూ, చివరికి రైళ్ళల్లో, బిగ్ బజారుల్లో రోడ్లనీ, పాయిఖానాల్ని శుభ్రం చేసేవారంతా దిగువకులాల వాళ్ళే తప్ప ఏ ఒక్క అగ్రకులస్తుడూ కాదని గుర్తుంచుకోవాలి. రోడ్డు ప్రమాదాలు, నేరాలు జరిగినప్పుడు సైతం, చివరాఖరికి

హాస్పటల్లో పోస్టుమార్టమ్ చేసేటప్పుడు కూడా వీలుంటే ఆ శాఖలోని దళిత బహుజనోద్యోగులకే ఆయా పనులప్పగిస్తున్నారనే పచ్చినిజాన్ని గుర్తించడమవశరం. ఏ కులంలో పుట్టినా బ్రాహ్మణీయ రోగం పట్టుకున్న తర్వాత స్వచ్ఛత, శుభ్రత, పవిత్రత మొదలైన పదాలు తలకెక్కడంలో ఆశ్చర్యమేంలేదు గానీ ఆ కంపుని దేశానికంతటికీ రుద్దాలనుకుంటేనే ప్రమాదం.

ఏ దేశంలోని ప్రజాస్వామ్య ఔన్నత్యమైనా ఆ దేశ ప్రజలెంత చైతన్యవంతులనే విషయాన్ని ప్రామాణికంగా తీసుకుని బేరీజు వేయాలేకాని ఎంతమంది 'పరిశుద్ధంగా' ఉన్నారనే బ్రాహ్మణీయ సూత్రం ఆధారంగా కాదు. వ్యక్తిగత పరిశుభ్రతకి కొలమానం లేనిచోట, సామ్రాజ్యవాద ఉత్పత్తుల్నీ, కంపెనీ సరుకుల్నీ విస్తృతంగా వాడగలిగే స్తోమతున్నవారు మాత్రమే వాట్ని వాడిపారేసి అపరిశుభ్రతకి కారణమౌతున్నారని తెల్సుకుంటే, ప్రజలందర్నీ బ్రాహ్మణత్వంతో కాషాయీకరించాలనే కుట్రలో భాగంగానే ఈ 'స్వచ్ఛభారత్' కార్యక్రమమనీ తేలుతుంది. అసమానతలు తాండవిస్తున్న ఈ దేశానికి 'స్వేచ్ఛాభారత్' పేర్తో ప్రజాస్వామిక విలువల్నీ, సమతా దృక్పథాల్నీ పెంపొందించే ప్రయత్నం చేయకుండా, వ్యవస్థలోని ఆర్థిక సమస్యలకు, సాంఘిక రుగ్మతలకు జవాబు వెతక్కుండా ఆడంబరంగా తలబెట్టిన ఈ 'స్వచ్ఛభారత్' ఎవరి కోసం?

**- స్వచ్ఛభారత్ కార్యక్రమాన్ని నిరసిస్తూ...**



# హేతువాద దృక్పథం - విధానపరమైన కర్తవ్యం

"మనం లెక్కలతోనే సత్యాన్వేషణ చేయలేం.. అన్నింటికీ రుజువులూ, ప్రమాణాలు తేలేము.[1]"

- చార్లీచాప్లిన్

మొన్నీమధ్య విడుదలైన రెండు మూడు చలనచిత్రాలు (పి.కె., గోపాల గోపాల) వ్యవస్థలోని నిజాలను తెరకెక్కించే ప్రయత్నం చేయడంతో సహజంగానే మతతత్వ శక్తుల ఆందోళనకి కారణమయ్యాయి. వ్యవస్థితమైన అక్రమాల్ని ప్రశ్నించే వాతావరణం కూడా కనుమరుగయ్యే స్థితి మరెంతో దూరంలో లేదేమోననే సందేహం ఆలోచనాపరుల్లో బలపడుతోంది. సమాజ హితం కోసం భావప్రసార నైపుణ్యాన్ని వినియోగించుకోవడం కూడా మనోభావాలు దెబ్బతీయడంగా ప్రచారమవడం అనారోగ్యకరమైన పరిణామం. ఈ పరిస్థితిని సమర్ధవంతంగా ఎదురుకోవడం భావోద్యమాల తక్షణ కర్తవ్యం. ఐతే, ఈ సమయంలో దృష్టి సారించాల్సిన విషయాలు రెండున్నాయి. మొదటిది ఏది ప్రగతిశీల దృక్పథం? రెండు ఏమిటి దాని కర్తవ్యం (లేక కార్యక్రమం?) శాస్త్రీయాలోచనా వైఖరులుగా ప్రస్తుతం చలామణీ అవుతున్న వివిధ ధోరణులను మాత్రమే ప్రమాణాలుగా చేసుకుని మొత్తం ప్రజలకి సంబంధించిన కర్తవ్యాల్ని నిర్ధేశించడమనేది వైధానిక సంకుచితత్వానికి (Methodological Narrowness) పరాకాష్ట. ఈ మధ్య ఒక ప్రముఖ ఆంగ్ల దినపత్రికలో పి.ఎమ్. భార్గవ 'శాస్త్రదృక్పథం లేని శాస్త్రజ్ఞుల'[2]నే వ్యాసం రాస్తూ దేశంలో వైజ్ఞానిక వాతావరణం లేని కారణంగా గత 85 సంవత్సరాల్లో భారతదేశం సైన్సులో ఒక్క నోబుల్ విజేతని కూడా తయారుచేయలేక పోయిందంటూ ఆందోళన వెలిబుచ్చుతారు.

---

1. నాకథ (my Autobiography) చార్లీచాప్లిన్, తెలుగు : వల్లభనేని అశ్వనీకుమార్, ఆర్ట్స్ & లెటర్స్ మూడో ప్రచురణ, హైద్రాబాద్ - 2013.
2. Scientists without scientific temper, P.M. Bhargava, 'The Hindu', Saturday Jan 17, 2015.

నిజానికి గత కొంతకాలంగా దేశంలో ప్రమాదకరమయిన 'కొనుగోలు సామర్థ్య కుట్ర' జరుగుతోంది. పౌర సమాజం మొత్తాన్ని వినియోగదారులుగా, వినిమయదారీ దాసులుగా మాత్రమే పరిగణించి చూసే కార్పొరేట్ సంస్థలే వినాశకరమైన సంస్కృతిని పెంపొందిస్తూ ప్రజానీకాన్ని అనాలోచనాపరులుగా, ఆర్థిక విషయాలకీ, దైనందిన సౌకర్యాలకీ కట్టుబడిన యంత్రాలుగా మారుస్తున్నాయి. ఇలాంటప్పుడు 'నిర్దిష్టత'ను ఆశ్రయించడం ఎంతవసరమో, నిర్లిప్తతను ఛేధించే అస్తిత్వోద్యమాలపట్లా, ప్రజాతంత్ర ప్రయత్నాల పట్లా భావోద్యమకారులు తమ వైఖరిని స్పష్టం చేసుకోవడం కూడా అంతే అవశరం. "వ్యక్తి తన జీవితం పట్ల లేదా తన చుట్టుపక్క సమాజం గురించి అసంతృప్తి చెందవచ్చు. సంఘం అవినీతిమయంగా ఉంటుండగా అందులోనుంచి బయటపడే మంచి మార్గాలు అట్టే లేకపోవచ్చు. అలాంటిచోట్ల పరిస్థితిని దాటిపోయి విమర్శ చేసే అవకాశం వ్యక్తికి ఉన్నదా? దోషపూరిత వివాహబంధంలో చిక్కుకున్న వ్యక్తి అన్ని పరిష్కార మార్గాలూ విఫలం కాగా విడాకులు కోరుకోవచ్చు. ఉద్యోగం చేస్తున్న వ్యక్తి ఎటూపోటానికి వీలులేని చిక్కుల్లో యిరుకున్నప్పుడు ఉద్యోగానికి రాజీనామా పెట్టవచ్చు. ఉన్న పరిస్థితిని ఒప్పుకోలేక, సందర్భాన్ని చూస్తూ ఊరకుండలేక వ్యక్తి కొట్టుమిట్టాడవచ్చు. జార్ చక్రవర్తులు పరిపాలించిన రష్యాలో రైతూ, నాజీ జర్మనీలో యూదు బయటపడాలనుకోవటం సహజం. అలాంటి సమాజంలో చిక్కుకున్న వ్యక్తి ఆ సాంఘిక వ్యవస్థను తృణీకరించడం హేతుబద్ధమే. అలాంటి వ్యక్తులు వేరేచోటికిపోయి జీవితాన్ని మళ్ళీ ప్రారంభించడం సహజం" అంటాడు పాల్‌కజ్[3]. ఇతర వుద్యమాలు భావోద్యమ ప్రాముఖ్యతను గుర్తించడం అవసరమని ఇంతకాలం వాదిస్తూ వస్తున్న నాస్తిక హేతువాద మిత్రులు, భావోద్యమాలు ఇతర ప్రజాతంత్రోద్యమాల్లో పాలుపంచుకోకపోవడమే వాటిలోని ప్రధాన లోపమని గుర్తించడం అవశరం.

కొద్ది సంవత్సరాలుగా దేశంలోని పరిస్థితేమిటంటే, ఎంతోమంది ఆదివాసీ గిరిజన గ్రామీణ ప్రాంత ప్రజలు పాలకులు చేపడుతున్న 'అభివృద్ధి'లో

---

3. సాహసించండి! మారండి!!, పాల్‌కర్జ్, తెలుగు-ఇన్నయ్య, హేమా పబ్లికేషన్స్ చీరాల-1998

సమిధలౌతున్నారు. ప్రకృతి ప్రసాదించిన జీవితాన్ని జీవించడం కోసం, మనుషులుగా తమ హక్కులు నిలుపుకోవడం కోసం నిరంతరం యుద్ధం చేస్తున్నారు. బాక్సైట్ కంపెనీలు మొదలుకుని ఎస్.ఇ.జెడ్ పరిశ్రమలదాకా లెక్కలేనన్ని దోపిడీ ముఠాలు భూగోళాన్ని వల్లకాడుచేస్తూ లాభాలవేటలో మునిగితేలుతుంటే నేటవ్ అమెరికన్ల మాదిరి దృఢచిత్తంతో నీటికోసం, నేలకోసం పౌరసమాజం ప్రాతినిధ్యం వహిస్తున్న 'నాగరికత'ని మానవీయంగా సవాలు చేస్తున్నారు. ప్రసార మాధ్యమాలు మొదలుకుని రాజకీయ నాయకుల వరకూ అందరూ అమ్ముడుపోడానికి ఇష్టపడుతున్న సమయంలో ఆత్మగౌరవం కోసం నిలబడి పోరాడుతున్నారు[4]. "భారతదేశంలో జరుగుతున్న ఉద్యమాలను అధ్యయనం చేస్తే తేలేది ఏమంటే, ప్రజలు కేవలం తమ రాజ్యాంగ హక్కులను మాత్రమే డిమాండ్ చేస్తున్నారు. అయితే ప్రభుత్వం మాత్రం ప్రజాస్వామ్యానికి పునాదైన, న్యాయబద్ధ, నైతిక విలువలతో కూడిన రాజ్యాంగానికి కట్టుబడి ఉండాలని అనుకోవడం లేదు" అంటారు సామాజిక మేధావి, రచయిత్రి అరుంధతీరాయ్[5]. ఈనాటికీ దేశంలో బిసిల కుర్చీలపై అన్యాయకరంగా సాగుతున్న దాడుల్ని రోజురోజుకూ విస్తరిస్తున్న విలువల పతనాన్ని, బలపడుతున్న అసమానతల్నీ పట్టించుకోకుండా వాటిల్లో మిళితమై మాత్రమే చైతన్యోద్యమాల్లో భాగం కాగలమనే స్పృహ లేకుండా కేవలం శాస్త్రప్రచారానికి సంబంధించిన పదజాలాన్ని వుపయోగిస్తూ దానినే భావజాలమని భ్రమించినంతలో ప్రయోజనం లేదు[6]. "The standard of life has to be enhanced, not only materially but also in the sphere of outlook and values. A new social being has to emerge in the course of the revolutionary process"[7]. అన్న చెరుకూరి రాజ్‌కుమార్ (ఆజాద్) మాటల్నుంచి ప్రగతిశీలోద్యమాకారులంతా ఏదైనా గ్రహించగలరేమో తరచి చూసుకోవడమవసరం.

---

4. ప్రసార సాధనాలు – పీడిత ప్రజలు, పి. సాయినాథ్, తెలుగు – కలేకూరి ప్రసాద్, హైద్రాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ – 1999.

5. ధ్వంసమైన స్వప్నం, అరుంధతీరాయ్, మలుపు ప్రచురణ హైద్రాబాద్ – 2011.

6. బిసిల కుర్చీలపై అగ్రకులాల కబ్జా ఎన్నాళ్ళు? రమణమూర్తి, జనహర్ష ప్రచురణ, హైద్రాబాద్ – 2008

7. Maoists in India (Writings & interviews of Azad), 2010

క్షేత్రస్థాయిలో ఎంతమేరకు ఆచరిస్తున్నామనేదానిపైనే అత్యున్నత ఆదర్శాలుగా భావించబడుతున్న ఆలోచనల విలువుంటుంది. విశ్వాసాలను తృణీకరించడమనేది ఉద్యమ కార్యాచరణలో ఒకానొక భాగమేకాని దానికదే విప్లవాత్మకమైన గొప్ప చర్య కాదు. ప్రజల భావపరంపరని శాస్త్రీయంగా మలచడం భౌతిక అసమానతల్ని ప్రశ్నించేందుకుకాక స్వార్ధపూరితమయిన భోగలాలసత్వాన్ని పెంచడానికి పనికిరావడం ఎక్కువ శాతం భావోద్యమాల పరిమిత పరిధికి చిహ్నమని అంగీకరించకపోతే, యిక ముందుముందు నాస్తిక హేతువాద భౌతికవాద శక్తులన్నీ స్వప్రయోజనాల కోసం ముఠా తగాదాలతో కొట్టుమిట్టాడే పరిస్థితుల్లోకి అనివార్యంగా నెట్టబడతాయనడంలో సందేహం లేదు. మతతత్వ శక్తులు అలాంటి సమయం కోసమే వేచివున్నాయి. ఇలాంటప్పుడు భావోద్యమ మిత్రులంతా వినూత్న రీతిలో సిద్ధపడి ప్రగతిశీల తాత్వికోద్యమాల్ని తీర్చిదిద్దుకుంటూనే భావజాల ప్రచారోద్యమాన్ని విస్తృతంగా ఆరంభించాలి. అన్ని ప్రజా సంఘాలతో మిత్ర సంబంధాల్ని పెట్టుకొని తాత్విక వైవిద్యాన్ని ఆహ్వానించగలగాలి. "Philosophy would then really be what our ancients wanted it to be, not merely an exercise of academicians but a song sung by millions"[8] అన్న లోహియా స్ఫూర్తిని గ్రహించి చేపట్టే ప్రతి కార్యక్రమాన్నీ వైధానిక తాత్విక స్థాయిలో చేపట్టినప్పుడే సాధారణ ప్రజానీకంలో మమేకం కాగలుగుతాం.



8. Works of Lohia, Anamika Publishers, Delhi - 2011.

# లైంగిక సంబంధాలు - ఒక పరిశీలన

"సమాజంలో వివాహిత స్త్రీ పురుషుల మధ్య లైంగిక వ్యక్తీకరణకు మాత్రమే బహిరంగ ఆమోదం వుంది. ఒకప్పుడు బహిరంగంగా వ్యక్తమైన లైంగికత తర్వాత నాలుగ్గోడల మధ్యకు నడిపించబడింది. వైవాహిక కుటుంబం దాన్ని స్వాధీన పర్చుకుని పిల్లలు పుట్టించేందుకు, పురుషాధిపత్యం ప్రదర్శించేందుకు మాత్రమే అంకితం చేసింది. పిల్లలు కనగలిగే భార్యాభర్తల మధ్య సంబంధం చట్టాన్ని శాసించింది. పునరుత్పత్తికి కేంద్రస్థానంగా తల్లిదండ్రుల పడకగది గుర్తించబడి, అందులో మాత్రమే సెక్స్ ఆమోదయోగ్యమైంది. మిగిలిన అన్ని రకాల సెక్స్‌సంబంధాలూ వాటి వాటి స్థితులను బట్టి ఖండనీయమైనవిగా, శిక్షార్హమైనవిగా, వికృత చేష్టలుగా, అసహజమైనవిగా మార్చబడ్డాయి. అలాంటి వాటిగురించి మాట్లాడకపోవడం సభ్యతగా చలామణీ అవుతోంది. మెజారిటీ లైంగికత మైనారిటీ లైంగికతను అణిచివేసింది. ఫలితంగా స్వలింగ సంపర్కం, వివాహేతర లైంగిక సంబంధం లాంటివి అజ్ఞాత జీవితం గడపాల్సి వస్తోంది... స్త్రీ పురుష లైంగిక సంబంధాలు మాత్రమే భారతీయతకు, హిందూ సంప్రదాయాలకూ అనుగుణమైనవని హిందుత్వవాదులు వాదిస్తున్నారు. అవి మాత్రమే ప్రకృతి సహజమైనవి హిందుత్వ, హిందుత్వేతర, వామపక్ష వాదులూ భావిస్తున్నారు. ఈ విషయంలో వారి మధ్య ఏకాభిప్రాయం యాదృచ్ఛికం కాదు. ఇద్దరూ పితృస్వామ్య బ్రాహ్మణీయ భావజాలానికి లోబడి ఉన్నవారే."

**- మానవ హక్కుల వేదిక కరపత్రం,**

'ఫైర్ పై దాడిని ఎదుర్కొందాం', 20.12.98



స్వలింగ సంపర్కం నేరం కాదని సుప్రీంకోర్టు ప్రకటించడం సాధారణంగానే వివాదస్పదమయింది. వ్యవస్థీకృతమయిన భావాలకి భిన్నమయిన అభిప్రాయాల్ని ఆహ్వానించే స్వభావం వ్యవస్థలో ఇంకా రాలేదనడానికి ఇదో ఉదాహరణ. మనిషి

అస్తిత్వానికి ఆర్థికత, ఔన్నత్యానికి లైంగికత ప్రధాన ప్రమాణాలుగా చూడబడుతోన్న వర్తమాన వ్యవస్థలో నిరంతరం విధ్వంసమౌతున్న విలువలకి వ్యక్తులుగా ఆసరాయిస్తూ స్వతంత్ర వ్యక్తిత్వాన్ని నిర్మించుకోవడమంత సులభం కాదు. సహజ ప్రాకృతిక లక్షణమయిన లైంగికతకు, నైతికత పేరుతో లెక్కలేనన్ని ముసుగులు తొడగడంతో అప్రయత్నంగానే అదో తరహా అప్రకటిత నేరంగా సమాజంచేత పరిగణించబడి, లైంగిక ఆకాంక్షను ప్రకటించుకోవడమో అపరాధ భావనగా తయారైంది. బాల్యం నుంచి సెక్సుపట్ల సమాజం అంతర్గతంగా అవలంభించే ఈ విధమయిన అనారోగ్య వైఖరి వలన కౌమారదశకొచ్చేనాటికే యువతలో నిర్మాణాత్మకమైన లైంగికోద్రేకం కంటే కూడా ప్రమాదకరమయిన విశృంఖలత్వం పెట్రేగిపోతోంది. సెక్సనేది పరస్పర అంగీకారంతో వ్యక్తమయ్యే స్నేహపూరిత ఆరాటంగా కాక తప్పనిసరి పరిస్థితుల్లో బలవంతంగానైన తీర్చుకోవలసిన రుగ్మతగా మారిపోయింది. పైగా, లైంగికతనేది ప్రపంచవ్యాప్తంగా పురుషుడి అధీనంలో వుంటూ అతడి మానసిక కోరికలన్నింటినీ రకరకాలుగా తృప్తిపరిచే అనివార్యమయిన ఉత్పత్తి సాధనంగా ఆడదాన్ని రూపొందించడానికి ఉపయోగపడుతోంది తప్పితే, సెక్సనేది స్త్రీకీ, స్వలింగ సంపర్కులకీ కూడా సమానమేనన్న ధోరణిని కల్పించడానికి కాదు. సాధారణ మధ్య తరగతి కుటుంబాలు మొదలుకుని ప్రసార మాధ్యమాలు – ప్రజాసంఘాల వరకూ మహిళలకు ఏపాటి గౌరవమిస్తున్నాయో తెల్సిందే కాన ఇక సెక్స్‌వర్కర్లూ, హోమోసెక్సువల్స్ మొదలైనవారి స్థితి ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. అందులో భాగంగానే భారత శిక్షాస్మృతిలోని 377 సెక్షన్‌ను తొలగిస్తూ లైంగికతను 'ప్రజాస్వామీకరించడం' సహజంగానే అప్రజాస్వామిక అభిమానులకు, ఆధిపత్య ఆరాధ్యులకూ కొరకుడు పడ్డం లేదు. ఈ సమయంలో వ్యభిచారాన్ని కూడా చట్టబద్ధం చేయడానికి వస్తున్న ప్రతిపాదనలను హేతుబద్ధంగా పరిశీలించడమవసరం. ఉద్యమ వేదికలపై ఉపన్యాసాలు దంచే నాయకులకూ, నైతికత పేరుతో రచనల్చేస్తూ సందు దొరికితే దొంగ చూపుల్తో చొంగ కార్చుకునే సిద్ధాంతకర్తలకూ తెలీకపోవచ్చును గానీ కాస్తో గొప్పో 'సెక్స్‌వర్క్'తో పరిచయమున్నవారికి అందులోని ఘోరాలు ఒక పట్టాన మింగుడుపడవు. శతాబ్దాల వేశ్యల చరిత్ర పరిశీలిస్తే, వందల ఏళ్ళ నుంచి మగాళ్ళ కామదాహానికి ఆహుతైపోతోన్న అనేకమంది అభాగ్యులు కళ్ళముందు మెదులుతారు. జీవితంలో మానసికంగా, శారీరకంగా వ్యభిచరించని

మనుషులున్నారనే వాదనతో నేనంగీకరించను కాన ప్రతివ్యక్తీ కచ్చితంగా వ్యభిచారై తీరాలని నేనేం సూత్రీకరించను గాని ఇన్ని సంవత్సరాల ప్రయత్నం సెక్స్‌వర్కర్స్‌ని మొత్తంగా కించపరచడానికీ, నీచంగా చూడ్డానికీ పనికొచ్చినంతలా మనుషుల్లా పరిగణించడానికి పనికిరాలేదనేదే నా ఆరోపణ. నేరాల్ని అరికట్టడంలో విఫలమైనంత మాత్రాన నేరాన్ని చట్టబద్ధం చేయడమెలా న్యాయమైనదనే సూత్రం సెక్స్‌ను 'నేరంగా' చూసినప్పుడు మాత్రమే నిలబడగల్గుతుంది. బహిరంగంగా పవిత్ర పదజాలంతో బురిడీ కొట్టించే ఎంతోమంది మేధావులు, జ్ఞానులు వ్యక్తిగత లైంగిక జీవితంలో తప్పటడుగులు వేయడం చూస్తున్నాం. పేదరికం కారణంగా సెక్స్‌వర్కర్లుగా మారి చివరికి రోగాల బారిన పడటం తప్ప సంపాదించిందేమీ మిగలకపోవడం పరిశీలిస్తున్నాం. ఎంతోమందిని ఆనంద పారవశ్యంలోను, సంతోష సుఖ సాగరంలోను అల్లల్లాడించి అంతిమంగా అందరికీ దూరమై హీనంగా మిగిలిపోయే అభాగినుల వేదనల్ని వింటూ కంటూ కూడా ఇంకా ఎప్పుడో మానవజాతిని ఉద్ధరిస్తుందనే కాల్పనిక నైతిక వ్యవస్థ కోసం ఇంతకాలం నుంచి సమిధలౌతున్న మహిళల జీవితాల్నీ యింకా అలాగే కొనసాగించాలనడం న్యాయం కాదు. ఆ స్త్రీల స్థానంలో మన కుటుంబాల్లోని స్త్రీలని ఊహించుకుని వాళ్ళకీ కుటుంబాలు, బాధలు ఉన్నాయని బలవంతంగా వాళ్ళనేదో ఉద్ధరించేవాళ్ళలా అంగీకరించాల్సినవసరం లేదుగానీ వాళ్ళ హక్కులను న్యాయంగా గుర్తించాలి.

ఇన్ని రోజుల సంస్కరణల చరిత్ర మహిళల్ని సుస్థిర జీవితంవైపు మళ్ళగలిగేలా చేసిందా లేదా మరింతగా ఈ ఊబిలోకి దిగజార్చిందా అనే ప్రశ్న ఎవరికివారేసుకోవడం మంచిదేకాని దానికి సమాధానం నిజాయితీగా వెతికేందుకు మనలో ఎంతమంది అంతరాత్మలు సిద్ధపడతాయనేదో సమస్య. సామాజిక గమనానికి లైంగిక ప్రేరేపణగా కార్పోరేట్ వ్యవస్థచేత రుద్ధబడుతున్న స్త్రీ శరీరం, ఈ రోజు మొత్తంగా ఒక విలాసవంత, ఖరీదైన సరుకుగా చూడబడ్డం ఎంత అమానవీయమో ప్రచారం చేయడానికి ప్రత్యేక సమయం కేటాయించుకోవచ్చు కానీ, ఈలోపు లక్షలమంది పేద, మధ్యతరగతి, ఆదివాసీ, గిరిజన, బహుజన స్త్రీలు ఈ రొంపిలో దిగి దోపిడీ అవుతూ అక్రమంగా పోలీసుల్ని, రౌడీమూకల్ని మేపడం కోసం శరీరాన్ని తార్చుకోకుండా వుండటం కోసం తక్షణం వారి సమస్యల్ని పరిష్కరించాలి. కనీసం ఇతర రాష్ట్రాల్లోలాగా గుర్తింపు కార్డుల్ని జారీచేయాలి. మెరుగైన వైద్య సదుపాయం

కల్పించాలి. వారి పిల్లలకు నాణ్యమయిన విద్యా, ఉపాధి అవకాశాలివ్వాలి. అంతిమంగా, దశలవారీగా ఈ వృత్తిని రూపుమాపడానికి ప్రణాళిక రూపొందించి నిపుణులతో, స్వచ్ఛంద - సామాజిక సంస్థలతో చర్చించడం, అందుకనువైన మార్గాలకోసం ప్రయత్నించడం, ఈ విధమైన గత కార్యక్రమాల్ని అధ్యయనం చేయడం లాంటివన్నీ చెయ్యొచ్చు. ఏదేమయినా, ఈరోజు జనాభాలో అత్యధికమందిచేత చులకనగా, నీచంగా చూడబడుతున్న సెక్స్‌వర్కర్స్‌గానీ, హోమోసెక్సువల్స్‌గానీ ఈ సమాజంలోని అత్యధిక శాతంమందియొక్క చులకన స్వభావాలకీ, నీచమైన కోరికలకీ ప్రతిరూపాలే కాని సమాజానికతీతులు కారు. కాబట్టి, వ్యక్తిగత లైంగికతనేది స్వచ్ఛందంగా కూడా జనించే కాంక్ష కారాదనేది లేదుకాన ఆ లక్షణాన్నాధారం చేస్కుని వ్యక్తిత్వాన్ని నిశ్చయించడం, సాంఘిక హోదాను నిర్ణయించడం మొదలైనవి మానుకోవాలి.

అన్నిట్లోనూ నూతనత్వాన్నీ, సృజనాత్మకతనూ పెంపొందించడానికి జరుగుతున్న ప్రయత్నాలు సమాజానికి, 'ఆధునికత'గా కనిపిస్తుంటే, లైంగిక విషయాల్లో వస్తున్న మార్పుమాత్రం ఈ ఆధునికులకి 'అశ్లీలత'గా అగుపిస్తోంది. స్త్రీని ఎలా చూపించాలో సవాలక్ష కోణాల్లోంచి ప్రయోగాలు చేసిన పురుష పుంగవుల ప్రయత్నాలు, మగాళ్ళెలా కనిపిస్తే బావుంటుందో మహిళలు నిశ్చయించబోయే సందర్భాల్లో ఉపయోగపడాలని నేనైతేకోరుకుంటాను. పురుషుడి కోరికల్ని తీర్చే మానవయంత్రంగా చూడబడుతున్న ఆడది మగాడ్ని బానిసగా చేసుకుని రాజ్యమేలే రోజుర్రావాలనుకుంటాను. ప్రజాస్వామ్య భావనకీవిధమయిన అభిప్రాయం విరుద్ధమైనదనే వాదనతో నేనంగీకరించను. ఇంతకాలంగా జనాభాలో సగంగానున్న స్త్రీలని తన స్వార్థం కోసం, సంతృప్తి కోసం లెక్కలేనన్ని మార్గాల్లో అక్రమంగా దోచుకున్న మగజాతికి స్త్రీ సాంగత్యమే కాదు, మార్గదర్శకత్వం కూడా మరో ప్రపంచాన్ని సృష్టించగలదనే నిజం తెలియాలి. ఇతర జీవుల్లోలా కాక మనిషిలో లైంగికతనేది పునరుత్పత్తి కార్యమే కాక సుఖాన్వేషణా కారకం కూడా. అది స్వలింగ సంపర్కంగా వుండాలా, పరలింగ సంపర్కంగా వుండాలా, హస్తప్రయోగంతోనో మరోవిధమయిన క్రియతోనో ఎవరికి వారు సంతృప్తి పడాలా లేక పరకీయమైన దృశ్యాల్లో, కాల్పనిక చిత్రాల్లో ఊహించుకోవడం ద్వారా ఆనందాన్ని పొందాలా అనేవి ఎవరికి వారు తీసుకోవలసిన నిర్ణయాలు. సమాజానికి నష్టం లేనంతవరకూ వ్యక్తుల లైంగికతపై ఏ విధమయిన పెత్తనమైనా నియంతృత్వమే. హార్మోన్ల కారణంగా

వ్యక్తమయ్యే స్వలింగ సంపర్కానికి సంబంధించిన లైంగికతను 'మానసిక రుగ్మత' గానో, 'శారీరక లోపం'గానో అర్థం చేసుకొని అసహ్యించుకోవడం వలనో, అంటరానితనం పాటించడం వలనో ప్రయోజనం లేదు. మొన్నమొన్నటి దాకా వాళ్ళ అస్తిత్వాన్ని గుర్తించడానికే ముందుకురాని సమాజం ఈ రోజు కొద్దోగొప్పో హక్కుల్ని కాపాడ్డానికి ప్రయత్నించడం మంచిదే కాని పరిస్థితింకా ఆశించినంతగా పురోగమించలేదు. కాస్తోకూస్తో సామాజిక చైతన్యం వుందనుకున్న వారికే ఈ విషయాల్లో స్పష్టత లేదు కాన యిక పౌర సమాజం సంగతి ప్రస్తావించక్కర్లేదు.

ఈనాటికీ 'వాళ్ళు' ప్రధానస్రవంతిలో భాగం కాలేదు. మనమింకా వాళ్ళని మామూలు వ్యక్తులుగా పరిగణించడానికి అలవాటు పడలేదు. విద్య, వైద్య ఉపాధవకాశాలనేవి వారికందుబాటులో లేవు. కొంటె చూపులు, వెకిలి నవ్వులు తప్ప వారి గురించి ఆలోచించింది లేదు. ఈ పరిస్థితి మారాలి. చెడిపోవడం అనే భావన స్త్రీకి మాత్రమే పరిమితమైనదిగాను, పాతివ్రత్యం ఆడదాని వరకే వర్తించేదిగానూ గుర్తించబడిన వ్యవస్థలో 'శీలం' అనే లక్షణానికి మగాళ్లతీతులనే సంప్రదాయం అమలవుతోంది. ఆధిపత్యం అలవాటుగా మారి ప్రవర్తన పెళుసుబారిపోతే, అహంకారం బుసలు కొడుతుంది. కుటుంబాలు ఛిద్రమవడం మొదలుకొని వ్యక్తిత్వాలు విచ్ఛిన్నమవడం వరకూ ఇదేకారణం. అయినవాళ్ళ అత్యుత్సాహం వలనో, అహంభావం వలనో మానవ సంబంధాలు మంటగలిసిపోతే, వ్యక్తులు దూరమైతే అభిమానించే హృదయమెంత దారుణంగా గిలగిలలాడుతుందో, తల్లడిల్లిపోతుందో నాకు తెలుసు. కుటుంబ కలహాల్లో, సామాజిక ఘటనల్లో తీర్పులిచ్చేందుకు తయారయ్యే మగమహారాజులకు సొంతింట్లో స్త్రీ స్వతంత్రాన్ని గూర్చిన స్పృహే ఉండదు. ఆడదాన్ని బానిసగా చూసే మగాళ్ళ దృష్టికోణం పూర్తిగా మారి స్త్రీస్వేచ్ఛను స్వాగతించడం మొదలుకొని, విభిన్న లైంగికతల్ని గౌరవంగా గుర్తించి, ఆ రకమయిన వ్యక్తులతో ప్రజాస్వామ్యబద్ధంగా వ్యవహరించడం జరగనంత వరకూ మానవ సంబంధాల్లోని అమానవీయ అసమాన స్వభావాన్ని సమూలంగా రూపుమాపలేం.

**- సెక్షన్ 377పై సుప్రీంకోర్టు తీర్పుకు స్పందనగా**

# నాగరిక దృక్పథాలు - మానవీయ పంథా

## (Civilized Attitudes - Humanistic Way)

సాధారణ ప్రజానీకానికి అవసరమయిన ప్రధాన విషయాలకు సంబంధించిన తాత్వికత కూడా ఈరోజు వారికి అందుబాటులో లేదు. ఇన్ని దశాబ్దాల ప్రగతిశీలోద్యమాల చరిత్రంతా అట్టడుగువర్గాల ప్రజల్ని మూక మనస్తత్వంతో కూడగట్టి సభలు, సమావేశాలక్కు తరలించడానికి ఉపయోగపడినంతగా స్వతంత్రాలోచనా పిపాసను వారిలో నింపడానికి ఉపయోగపడలేదేమోననే వాదనను పట్టించుకోవడమవసరం[1]. వ్యవస్థలోని అన్ని విభాగాల్లోనూ వ్యవస్థీకృతమయిపోయిన అక్రమాల్ని స్వచ్ఛందంగా అంగీకరించడానికి అలవాటుపడుతున్న సమాజంలో 'ప్రశ్నించడం' కూడా నాగరికతేనన్న విషయం విద్యావంతులచేతే విస్మరించ బడుతోంది. సమాజ గమనానికి సంబంధించిన అత్యాధునిక నూతన విషయాల్లో వారి ప్రతిపాదనను తిరుగులేనివని రుజువుచేసుకోవడం కోసం ప్రయత్నించే మేధావులకూ, దైనందిన జీవితాల్లోని వాస్తవ సమస్యల గురించి మూలాలు అర్థం చేసుకోడానికి నిరంతర పరాయీకరణకు (Continuous Alianation)[2] అలవాటుపడుతోన్న సామాన్యులకూ మధ్య అఖాతాల్ని వీలైనంత కుదించడమే నేటి ప్రజా ఉద్యమాల గమ్యం. అయితే, ఈ సమయంలో ఉద్యమాలుగా చలామణీ అవుతోన్న సమూహాల అస్తిత్వానికి సంబంధించిన యదార్థ ప్రాతిపదికను గురించి

---

1. One of the greatest weaknesses of immentist philosophies in general consists precisely in the fact that they have not been able to create an ideological unity between the bottom and the top, between the "simple" and the intellectuals, అంటాడు ఆంటోనియా గ్రాంసీ చూడు, Selections from the prison notebooks of Antonio Gramsci, edited and translated by Quintin Hoore and Geoffrey Nowell Smith, Orient Longman Pvt. Ltd - 2004, Page - 329.

2. దీన్నే "The main interest in life is to become someone else that you were not at the beginning..." అంటాడు Michel Foucault.

బాధ్యతగా మదింపు వేయాల్సి ఉంది[3]. పోరాటం ద్వారా రాజ్యాధికారమనే సిద్ధాంతాన్ని అనేక సంవత్సరాలుగా అమలులో పెడుతున్న సంస్థల తాత్విక క్రమాన్ని ప్రశ్నిస్తూ, నిలదీయడం కూడా యిందులో భాగమే. హింస, ఆధిపత్యం పునాదిగా ఉద్భవించే ఏ సమాజంలోనైనా సమానత్వం, ప్రజాస్వామ్యం రూపొందలేవు[4]. భౌతిక సుఖాలకు కుదిరినంతగా జీవితాల్ని వెచ్చించడమే ఆధునికతగా కొనసాగుతున్న వ్యవస్థలో భావపరిణామం పై దృష్టి సారించడానికి మించిన ప్రజాతంత్ర విధానమేదీ లేదు. ఈ క్రమం లోపించబట్టే గతంలో వైదికబ్రాహ్మణులూ, అగ్రకులాలవారు అర్థంకాని మంత్రాలు ఆశువుగా చెబుతుంటే చూస్తూ ఊరుకున్నవారే ఈ రోజుకీ అగ్రవర్ణాల అభ్యుదయవాదులే బట్టీపట్టిన ఆంగ్లపదోచ్ఛారణలతో అపరిచిత సిద్ధాంతాల్ని వల్లిస్తుంటే నోరెళ్ళబెడుతున్నారు తప్పితే చర్చ చేయట్లేదు[5]. శారీరక

---

3. దీన్నే Philosophy ingeneral does not infact exist. various philosophies or conceptions of the world exist, and one always makes a choice between them అంటాడు గ్రాంసీ, చూడు. Selections from the prison notebooks of Antonic Gramsci, edited and translated by Quintin Hoore and Geoffrey Nowell.Smith Orient Longman Pvt. Ltd - 2004, Page - 326.

4.. You can't blow up a social relationship. The total collapse of this society would provide no guarantee about what replaced it. Unless a majority of people had the ideas and organization sufficient for the creation of an alternative society, we would see the old world reassert itself because it is what people would be used to, what they believed in, what existed unchallenged in their own personalities. అంటూ 'you can't blow up a social relationship, The Anarchist Against terrorism అనే కరపత్రం ప్రకటించింది. 1979లో సోషలిస్ట్ లిబరల్ సంఘాలు ఆస్ట్రేలియాలో ప్రచురించిన ఈ కరపత్రం 1981లో అనార్కిస్ట్ కమ్యూనిస్ట్ ఫెడరేషన్ (ACE) కెనడాలో ప్రచురించింది. అమెరికాలో 1985, 1989, 1998 సం॥ల్లో ముద్రించబడింది. ప్రస్తుత ప్రచురణ 2006 లోది. Published by : See Sharp Press, P.O. Box : 1731 TUCSON.

5. "అండమాన్స్‌లో నాతోబాటు ఒక మిత్రుడు ఉండేవాడు. ఆయన స్టాలిన్ రాసిన లెనినిజం పుస్తకాన్ని 13 సార్లు చదివాడు. ఏ పేజీలో ఏముందో విషయాలను, వాక్యాలను కూడా చెప్పగలడు. ఈయనను ఆ చదువు కమ్యూనిస్టుగా తయారుచేయలేకపోయింది. ఆయన విడుదలైన తర్వాత ఒక్కరోజు కూడా రాజకీయరంగంలో నిలబడలేదు. ఆయన మంత్రాలు వల్లించినట్లే పుస్తకాలు చదివాడు. అర్థం చేసుకోడానికి ప్రయత్నించలేదు. అలాంటి చదువుల వల్ల ఏమి ఫలితం ఉండదు. అలాంటి చదువు ఫ్యాషనబుల్ పెద్ద మనుషులతోకూర్చుని వితర్కాలు, కుతర్కాలు చేయడానికి మాత్రమే పనికొస్తుంది. కార్యాచరణకు మార్గదర్శకత్వం వహించద"ంటారు శివవర్మ. చూడు, మార్క్సిస్టు సిద్ధాంత పరిచయం, అనువాదం - ఉద్ద రాజురామం, ప్రజాశక్తి ప్రచురణ - 1997 (ముందుమాటలో).

శ్రమను పట్టించుకోకుండా అర్థంకాని విషయాల్ని అందలమెక్కించడం ఈ దేశపు న్యాయమనే విషయంలో సందేహాలక్కర్లేదుగానీ సంఘ సంస్కరణను ప్రోత్సహిస్తున్న సంస్థలీ విషయంలో ఏం చేస్తున్నాయనేదో ప్రశ్న. ఆలోచనాత్మకమయిన జిత్తులమారితత్వాన్ని అభివృద్ధి చేసుకునేంత సమయం లేని బడుగు జీవులకు ఖాళీగా కూర్చొని ఒంటబట్టించుకున్న విషయాల్ని తడుముకోకుండా ఒప్పజెప్పడం గొప్పగా అనిపించడంలో వింతేమీలేదు కానీ నిర్మాణాత్మకంగా ఎందుకూ కొరగాని ఆ మంత్రపఠనం వల్ల సమాజానికేం ప్రయోజనముంటుందో నాగరిక వేదాలకి ప్రతినిధులైనవారు సెలవిస్తే బాగుంటుంది[6]. సత్యం, అహింసలకు ప్రాతినిధ్యం వహిస్తోన్న ప్రాతిపదికల్ని హేళన చేస్తూ యుద్ధభూమిలోని పోరాట పదజాలాన్ని ముందు పెట్టేవారికి అంతిమంగా మానవ స్వభావంలో వారు సృష్టిస్తున్న ద్వేషపు భావాల ఫలితం అంత త్వరగా అర్థంకాదు. ఆలోచనల్తో రాని మార్పు ఎంతటి ఆధునిక ఆయుధాలతోనైనా రాదనే నిజాన్ని మానవ సమాజం గుర్తించనంతవరకూ పెట్టుడు ప్రజాస్వామిక వ్యవస్థలన్నిట్లోనూ మూర్తీభవించిన అన్యాయం, అప్రజాస్వామికతే రాజ్యమేలుతుంటుంది[7]. భౌతిక ప్రతిపత్తికి ఆయుధాలు కూడా అతీతం కావు. మానవ నాగరికతను అవాంఛనీయ విలాసాలకు అన్వయించు కొంటున్నామంటేనే సిద్ధాంతాల పేరుతో సాయుధ పోరాటాల్నీ, సొంత విప్లవాల్ని తగిలించుకుంటున్న సమూహాల కార్యక్రమాల్ని కూడా నిరసిస్తున్నామని గుర్తించాలి. పాలకవర్గాలపైనున్న వ్యతిరేకతను నిరూపించుకోడానికి సాయుధ పోరాకటే శరణ్యమన్న భావన దానికదే అనాగరికంగా రుజువయిన సందర్భంలో సంస్థల ప్రజాతంత్ర స్వభావాన్ని నిరూపించుకుందుకు బలవంతంగా రహస్య సంఘాలకు మద్దతిస్తున్నట్లు బహిరంగంగా నటించనక్కర్లేదు. అజ్ఞాతంలో ఉన్న క్రూరమైన నేరస్తుల పేరుచెప్పి బయట దందాలు చేసుకునే చోటా మోటా దాదాలకీ, అడవిలో ఉన్న

6. "It is obvious that Socialism is built not by abstract, ideal, people, who have repudiated all their old views and habits, but by tangible, down to earth people, who are and can be pressured the burden of the past" అంటాడు V.P. Zotov, చూడు, The Marxist Leninist Theory of Society, Progress publishers, Moscow-1985, Page-280.

7. "వ్యక్తిత్వం అన్నది దానంతట అదే ఆదర్శం కాదు; హిట్లరుది కూడా ఒక వ్యకిత్వమే. మేథో వ్యక్తిత్వం ఆదర్శప్రాయమైనదం"టాడు బోరిస్ వ్యాసిలోవ్ తన నవల్లో, చూడు, హంసలను వేటాడొద్దు (Don't shoot the white swans) P-168.

విప్లవకారులకు మద్దతంటూ ప్రజలతో బేషజాలకు పోయే పదుల సంఖ్యలోనున్న దాబు సంఘాలకీ తేడా లేకపోవడమే వ్యవస్థ అజ్ఞానానికి చిహ్నం. ఒక ప్రజాస్వామ్య పంథాలోని అప్రజాస్వామ్య ధోరణుల్ని వ్యతిరేకిస్తున్నామంటే, దానర్థం మరో ఆధిపత్య వైఖర్ని అవలంభిస్తున్న ప్రమాదకర వ్యవస్థను ఆహ్వానిస్తున్నామని కాదు. మానవీయ దృక్పథంలోని లోపాల్ని పూరించడానిగ్గానూ అమానవీయతను స్వాగతించడం వివేకం కాదు. సమాజానికి సంబంధించిన రుగ్మతల తీవ్రతను గుర్తిస్తున్నామంటే వాట్ని గూర్చిన సమగ్రమయిన అవగాహన, చైతన్యం ద్వారా ప్రజల్లో వాట్ని ప్రజాస్వామికంగా పరిష్కరించుకునే ధోరణిని నిర్మించేందుకు ఎలా కృషి చేస్తున్నామనే దానిపై ఆధారపడి నూతన సాంఘిక వైఖరుండాలి గాని, ఆ రుగ్మతలకి సూచించే చికిత్సెంత విధ్వంసకరమైనదో, వినాశపూరితమైనదోననే ప్రమాణంపై ఆధారపడి కాదు[8]. గత సిద్ధాంతాల మూసలోనుంచి బయటపడి నూతన దృక్పథాన్ని వెల్లడిస్తున్నామంటేనే మన మానసిక వైఖరిలోని మార్పుకి ఆచరణాత్మకమైన రూపం కల్పిస్తున్నామని భావం. అది వ్యక్తిగత వ్యవహారాల్లో చొరబడకుండా కేవలం సాంఘిక నాటకంగా మిగిలిపోయినంతలో ఉపయోగం లేదు. అస్తిత్వోద్యమాలు మొదలుకుని అన్ని ప్రజాతంత్ర, ప్రగతిశీలోద్యమాల వరకూ ఉద్యమాల మనుగడని ప్రశ్నార్థకం చేసింది ఉద్యమకారుల్లోని ఈ ద్వైదీభావనే[9]. మానవ సమాజంలో ఏనాడు ప్రతిపాదించబడ్డ పద్ధతిలోనైనా అందులోని ప్రాకృతిక-మానవీయ ధోరణులెంత ఉన్నతమైనవనే విషయమే పరిశీలించబడాలికాని లౌకిక – భౌతిక సంపదల దృష్ట్యాకాదు[10]. అంటే,

---

8. An open letter to Ganapathi, GS CPI (Maoist) by Sumanta Banerjee, Published in frontier June 107, 2014 issue.

9. "హేతురహిత ఆలోచనా విధానానికి వ్యతిరేకంగా జరిపే పోరాటం పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా జరిపే పోరాటంలో భాగమై వుంటుందన్న నిజమైన స్వభావాన్ని బూర్జువా హేతువాదులు గుర్తించడంలో విఫలురు కావడంచేత వారు కేవలం నాస్తికత్వ ప్రచారకులుగా సామాజిక మార్పుకు అనుకూలంగా ఏదీ సాధించలేని వారుగా మిగిలిపోయారంటారు." చిన్నపరెడ్డిగారు చూడు, జస్టిస్ ఓ. చిన్నపరెడ్డి, సాహిత్య – సామాజిక ప్రసంగాలు, జనసాహితి ప్రచురణ, విజయవాడ - 2014, పేజి - 79. ఐతే కమ్యూనిస్టులు కూడా అలాగే మిగిలిపోయారనే నిజాన్ని కూడా గుర్తించడం అవసరం.

10. "భౌతిక సుఖాల్తోపాటు భౌతిక ప్రమాణాల్తో కొలవజాలని కొన్ని ఉన్నతమయిన విలువలున్నాయి. మానవత్వం, ప్రేమా, కరుణా, అభిమానము, సానుభూతి, సౌందర్య పిపాసా, సత్యాన్వేషణావంటివి సాంఘిక చైతన్యం, దేశభక్తి వంటివి కూడా వీటికిందే వస్తాయి.

దానర్థం సామాజికవసరాల్నీ, నాగరిక సౌకర్యాల్నీ పూర్తిగా త్యజించి జీవించమని కాదు. ఒక ఉన్నత సమాజం కొరకు రూపుదిద్దుకున్న సిద్ధాంతాలకు సంబంధించిన ప్రతిపాదనల్లో అనేక వైరుధ్యాలుండొచ్చు. ఆచరణాత్మకంగా అవి ఒకానొక రూపంగా సాధ్యమయ్యే వరకూ వాటిల్లోని లోపాల్నీ గుర్తించకపోవచ్చు. కానీ, నాగరిక దృక్పథాల పట్ల మనమనుసరించే మానవీయ మార్గం ద్వారానే నవీన ప్రయత్నాల్లోని వైఫల్యాల్ని సైతం విలువయిన అనుభవపాఠాలుగా, ఆరోగ్యకరమైన ప్రగాఢ సంవాదాలుగా ఏర్పర్చుకునే లక్షణం లోపించడం జరిగితే సాంప్రదాయ యాంత్రిక గుణాలే ఉద్యమాల్నీ, సమాజాన్ని శాసిస్తుంటాయి.[11]"



ఈ విలువలు జీవితానికి నిండుతనం చేకూరుస్తాయి, బ్రతుక్కొక అర్థం కల్పిస్తాయి. వీటినాశ్రయించే కళా, సాహిత్యం, సంస్కృతీ వంటివి వికసించి పుష్పిస్తూ ఉంటాయి. ఈ విలువలె ఆధునిక మానవుణ్ణి అటుప్రాచీన మానవునితోనూ ఇటు భవిష్యన్మానవునితోనూ కలిపి, ఆ విధంగా మానవత్వానికి ఒక విధమైన అమరత్వం కలుగజేస్తాయి. ఈ కళాసాహిత్య సంస్కృతులు ఏ విలువల బలమైన పునాదుల మీద నిలబడతాయో అది అంత ఉన్నతంగానూ ఎదిగి కలకాలం నిలిచి ఉంటాయం"టారు వాసమూర్తి 'ఆలోచనాస్రవంత' నే వ్యాసంలో. చూడు, కళాకేళి సాహిత్య మాసపత్రిక (మొదటి సంచిక), ఏప్రిల్ 1968, ఎడిటర్ - ఆవంత్స సోమసుందర్.

11. అందుకే "జ్ఞానం ఎప్పుడూ ఆచరణ ద్వారానే ప్రమాణీకరించబడుతుందం"టారు కె.ఎస్. చలం, చూడు, ఇండియాలో సామాజిక పరిణామం, హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ, జనవరి 2015, పేజి - 72.

# ముగింపు

**"How can one believe that people who prove incapable of existing on their own planet will really adapt to life on another one?[1]"**

– Soviet Biologist Kamshilov

**ఈరోజు** మానవ మనుగడను ప్రకృతితో మిళితంచేసే ప్రత్యామ్నాయ ఆరోగ్యకరమయిన జీవన విధానాలు గూర్చిన విభిన్న అధ్యాయనాలు – సంవాదాలు అనివార్యంగా తలెత్తుతున్నాయి. నాగరికత పేరిట భౌతిక వనరుల విచ్చలవిడి వినియోగానికి ప్రాధాన్యతనిచ్చి ఆత్మిక విలువల్ని తేలికగా చూసే వ్యవస్థలో, ప్రగతిశీలమైన శాస్త్రీయ భావజాలానికి సైతం నిర్ధిష్టమయిన అభ్యుదయ ప్రాతిపదిక లేకపోతే పాక్షిక పదజాలాలన్నీ ఆరాధించబడతాయి. మతాన్ని వ్యతిరేకించే మనస్తత్వాలు సైన్సునో, మరో సిద్ధాంతాన్నో గుడ్డిగా అంగీకరించే ధోరణి పెరగటం వలనే అతీతశక్తుల స్థానంలో ఐహిక సరుకుల్ని పెట్టుకొని పూజించడం జరుగుతోంది.

మానవికమయిన మానసిక వైఖరి క్రమక్రమంగా మరుగునపడి ఆధునికత పేరిట పశుప్రవృత్తి పెచ్చరిల్లుతోంది. ఈ అక్రమ క్రమాన్నంతటినీ ఏకమొత్తంగా ఏదోక సిద్ధాంతాన్ని అడ్డుపెట్టుకుని వ్యతిరేకించడం సాధ్యం కాదు కాన ప్రత్నామ్నాయ ఉద్యమ మార్గాలన్నిటినీ అధ్యయనం చేయాలి. ఇతర విధానాల్ని విమర్శించడం పురోగమనానికి సోపానమనే వాదన మన పద్ధతిని సైతం నిజాయితీగా ప్రశ్నించుకున్నప్పుడు మాత్రమే నిలబడగలుగుతుంది. మార్క్సిజమో, సోషలిజమో మాత్రమే ఏకైక మార్గంగా కనబడేవారికి చరిత్రగతిలో సాంఘికాభ్యుదయ శక్తులు ఏకాకిగా మిగిలిపోడానికి కారణం అంతుబట్టదు.

మానసికోద్యమాల లక్ష్యం విస్తృతమయిన భావప్రవృత్తే కాని భౌతిక సంపదల సృష్టికాదు. ఐతే, దీనర్థం ఆంతరికోద్యమాలు పూర్తిగా ఆధ్యాత్మికపరమైనవని కాదు.

1. Beyond developmentality by Debal Deb, Published by Danish Books, Delhi - 2009, Page 238, Chapter - Arguments for Alternatives

చరిత్రలో మనిషి ప్రాపంచిక సౌకర్యాల కోసం వెచ్చించిన సమయం, శ్రమ మానసిక పరిణితి గురించి వెచ్చించడం జరగలేదు. జరిగినా అదెన్నో ఆటోపోట్లనీ, గాయాల గాట్లనీ భరించాల్సొచ్చింది. మానవుడి ఆలోచనాభివృద్ధి సామాజిక అభివృద్ధిలో భాగంగా ఎన్ని సమానత్వ, సమతా వాదాలనయినా నిర్మించుకోవచ్చును గానీ, దానికి సమాంతరంగా మానసిక పరిణితి జరగకపోతే, మేధోవంతమైన చైతన్యశీలి సహజ లక్షణమైన ఆలోచనను పనిగట్టుకుని అభివృద్ధి చేయాల్సిన దుర్భర పరిస్థితులు తలెత్తుతాయి.

వ్యక్తి భావజాలాన్ని సమిష్టిగా నిర్వహించుకునే ఈ తప్పుడు క్రమం వలనే గొప్ప సిద్ధాంతాలుగా చలామణీ అవుతోన్న విషయాలు కూడా మతాలకు ప్రత్యామ్నాయాలుగా మారిపోయి నూతన నియంతృత్వపోకడల్ని అనుసరిస్తున్నాయి తప్పితే యధార్థాల్ని గుర్తించడం లేదు. ఇందువల్ల మానవాభివృద్ధికి తోడ్పడే సారం ఆ సిద్ధాంతాల్లోని స్వార్థానికి బలైపోతోంది. కాద్దోగొప్పో నిబద్ధత గల ఆచరణకు పూనుకొని క్షేత్రస్థాయిలో పాటుపడుతోన్న వైనాలన్నీ, సిద్ధాంతాల్లో ఇరుక్కున్నవారి వైరానికి కారణమౌతున్నాయి. ప్రయత్నపూర్వకంగా అలవర్చుకునే ప్రాపంచిక విశాలదృష్టే దీనికి విరుగుడు.

మనిషి మానసిక వైశాల్యాన్ని ఇనుమడింపజేయని ఇరుకు వాదాల వల్ల వివాదాలు, విద్వేషాలే జనిస్తాయి. ఈ లక్షణాల్ని స్వయంగా వొదుల్చుకుందుకు నిరంతరం చేసే సాధనలోనే బౌద్ధోద్యమకారులు భౌతిక కార్యాచరణ పరిధి, దార్శనిక భావ విస్తృతీ విస్తరిస్తుంటాయి. వ్యవస్థీకృతమయిన సామాజిక సంప్రదాయాల్లో ఇరుక్కుని ప్రాపంచిక దోషాలకు ఆకర్షితులవ్వడం ఎంతటి ఆలోచనాపరునికైనా తప్పకపోవచ్చునుగానీ అందుకోసం ఎంతోకాలం నుంచి మానసికంగా రూపొందుతూ వొచ్చిన ఆంతరిక సత్యాన్వేషణా సంకల్పాన్ని మట్టుకు వొదులుకోకూడదు. సత్యశోధనకు తత్వసాధనమొక్కటే దారి. మాడభూషి భావనాచార్యులుగారన్నట్లు, "సమాజం స్థాణువు కాదు... ప్రవాహ స్రవంతి[2]." సెలవు.

---

2. ప్రాచీన భారతదేశ చరిత్ర, సంస్కృతి, తాత్విక చింతన, డాక్టర్ మాడభూషి భావనాచార్యుల వ్యాసావళి, సంఘమిత్ర ప్రచురణలు, విజయవాడ-2011.

# గౌరవ్ ఇతర రచనలు

1. ప్రజాస్వామ్య పతనం
2. అరాజకత్వం అంటే ఏంటి?
3. సాంఘిక తత్వం - వైప్లవ మార్గం
4. ఒక నాస్తికుడి నామా
5. ప్రజాస్వామ్య ప్రస్థానం
6. అస్తిత్వం - అరాజకత్వం
7. మద్యంపై యుద్ధం
8. మతానికి మరణశాసనం - మనిషికి పునరుజ్జీవనం
9. కరపత్రాల కథాకమామిషు
10. తత్వ విచారణ - తర్క వివేచన
11. పురుషుడు - స్త్రీ (చలం Man & Womanకి స్వేచ్ఛానువాదం)
12. కులానికి సవాలు
13. ప్రకృతి - శాస్త్రం - సమాజం
14. ధిక్కార స్వరాలు (భావోద్యమకారులింటర్వ్యూలు)
15. సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా (జయప్రకాష్ నారాయణ్ వ్యాసానువాదం)

